బాలానంద

# జై వీర హనుమాన్

(తులసీదాస్ - హనుమాన్ చాలీసా)



శ్రీ ధూళిపాళ రామమూర్తి



నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్.......................విజయవాడ - 2

# విషయసూచిక

శ్రీ మహా గణాధిపతయే నమః

# జై వీర హనుమాన్

## [శ్రీ తులసీదాసు – హనుమాన్ చాలీసా]

శ్రీహరి దయావిశేషముచే భారతదేశము కర్మభూమిగా పేరందినది. ఇచట మహానుభావులు, విజ్ఞానవేత్తలు, భక్తులు, మహామునులు, త్యాగధనులు పెక్కుమంది జన్మించి వారి పవిత్ర పాదరజముతో యీ భారత భూమిని యింకను యెక్కువ వన్నెకు తీసికొని వచ్చినది. గంగా, యమునా, సరస్వతులు, వాటి సంగమప్రదేశము నర్మదా, తపతీ, గోదావరి, కృష్ణా, కావేరి మొదలగు మహానదులిందు ప్రవహించుచున్నవి. ఇందుకు మహా ధన్యులు భక్తాగ్రేసరులు పెక్కుమంది జీవితమున్నియు దైవపరముగా త్యాగములు చేయుచు, నారాయణుని దర్శనమందుచు నడచినవే. ఇందు మహా వనములు, పర్వతములు, పుణ్యాశ్రమముల వికాసముగా తత్త్వబోధలకు, భక్తిపారవశ్యమునకు తోడుపడుచున్నవి. ఇందుత్తర భారతములో ప్రపంచ ఖ్యాతినందిన గంగానది ప్రవహించుచున్నది. ఈ గంగానది గంగోత్రివద్ద పుట్టినది. హిమాలయ పర్వతారణ్యములలో పది పదిహేనుమైళ్ళ దూరము దట్టమగు నోషధులతో నిండిన ప్రదేశములో ప్రవహించుచు గంగోత్రివద్ద బయటకు వచ్చినది.

అక్కడనుండి హిమాలయ పర్వతమునుండి నురకలమీద దాటులు దాటుచు క్రమముగా నమ్రప్రదేశముగా చెప్పబడు "హరిద్వార"మను మహా క్షేత్రమునకువచ్చి యచటనుండి తన ప్రవాహము సమతలములో సొంపుగా నడుచునట్లు పొగుచున్నది. క్రమముగా ప్రయాగ క్షేత్రముదాటి కాశీక్షేత్రము మీదుగా కొన్ని మహాక్షేత్రములు పునీతము చేయుచు సముద్రంలో గలియు చున్నది. ఇట్లు సమతలమున ప్రవహించి గంగానదీ తీరము పొడుగునా గ్రామ

ములు, పట్టణంలు, మహాక్షేత్రములు గలవు. పూర్వకాలంనుండి పుణ్యాత్ములకు వానయోగ్యమగు బ్రాహ్మణాగ్రహారంబులుండెను.

అట్టి గ్రామములలో వేదములు, శాస్త్రంలు చదివి యతిథి యభ్యాగతుల నాదరించు వారలుగా బ్రాహ్మణుల కుటుంబములుండెను. అట్టి కుటుంబములున్న గ్రామంగా పేరందిన యొకగ్రామం గంగాతీర ప్రాంతంలలో నుండినది. ఆ గ్రామంలో నొకబ్రాహ్మణ కుటుంబంవారు కాపురముండిరి. ఆ కుటుంబం నకు యజమానిగా ధర్మవేత్తయగు పుణ్యాత్ముడు సంచరించుచుండెను. అయనకు పూర్వ పుణ్యవశమున చక్కని కుమారుడు శుభలగ్నమందు జన్మించెను. ఆ కుమారుని చూచి కుటుంబంలోని వారందరూ పరమానందమందిరి. పుట్టిన తరువాత పురిటి శుద్ధిరోజున పురిటి స్నానం తల్లికి పిల్లవానికి చేయించిరి. తరువాత విద్యావంతులగు గ్రామవాసులగు బ్రాహ్మణులను పిలిపించి తన కుమారునకు జన్మోత్సవం గావించిరి. నామకరణం సమయంలో నా పిల్లవానికి "తులసి" యను నామముంచిరి. ఆ పిల్లవానిని తల్లిదండ్రులు ప్రేమగా గారాబంగా పెంచ సాగిరి. ఆ బాలుడు తనయిల్లు పరమ శ్రోత్రియుల గృహమగుటచే మంచి అభ్యా సములుగల్గి బాలుని తీర్చిదిద్దుచుండిరి. తల్లి మహాభక్తురాలు. తన కుమారుడు పెరిగి పెద్దవాడైన గొప్పవానిగా తయారు కావలయునను కోరికతో నుండెడిది. వానిచేత రామభజన చేయించుచు రామః రామః యనిపించుచు నాడించుచుండెడిది

తీరిక వేళలందు కూర్చుండ నేర్పిన తరువాత భజనలు చేయించుచు పొంగుచు కాలము జరుపుచుండెడిది. తన కుమారుని ఎవరు ఏమిచేయుదురోయని వేయికళ్ళతో చూచుచుండెడిది. బాలుడైదేండ్లవాడైన తరువాత తండ్రి తులసి కక్షరభ్యాసము గావించెను. ఓనమాలు దిద్దించి శుభముహూర్తమునందు పాఠశాలకు పంపించెను. ఆ రోజులలో బడిపంతుళ్ళందరు విద్యావంతులే. వారు శ్రద్ధగా శిష్యులను తీర్చిదిద్దగల సామర్ధ్యము గలవారు. తమవద్ద విద్య నేర్చినవారందరూ గొప్పవారైయుండి కీర్తి సంపాదించుకోవలయునను కోరికతోడనే వారు సొమ్ము ప్రధానము గాకుండా విద్యాదానం ప్రధానముగా గణించుకొనుచు విద్య నేర్పు చుండువారు.

అట్టి గురువువద్ద తులసి చదువునకు ప్రారంభించెను. పూవు పుట్టగనే సువాసన గన్పించుచున్నట్లు పిల్లవాడు గురువు దిద్దించిన యక్షరములు చక్కగాదిద్ది వాటినప్పగించెడివాడు అతడు క్రమముగా పుస్తకము పట్టెను. వానిచే బాలరామాయణము, శబ్దమంజరి, ఇతర ప్రార్థనా శ్లోకములు చదివించ సాగెను.

## తులసీదాసు విద్యాభ్యాసము

తులసి బుద్ధిబలముతో వాటినప్పగించువాడాయెను. ఆ చురుకుతనము, బుద్ధిబలమును గురువు మెచ్చుకొని తనవద్ద కూర్చుండబెట్టుకుని శ్రద్ధగా పాఠములు చదివించుచు బోధించుచుండెను. వాటిలోని యర్థములు గొప్పగా వివరించసాగెను. బాలుడుపనయన వయస్సువాడైన తరువాత తండ్రి తన కుమారున కుపనయనము గావించెను. ఉపనయనానంతరము బాలునిచే త్రికాల సంధ్యావందనము గావింపజేయుచు విఘ్నేశ్వరపూజ పుణ్యాహవచనము చెప్ప సాగెను. తదుపరి పూజామంత్రములు, అభిషేక మంత్రములు. హారతి, మంత్ర పుష్పములు వరుసగా తండ్రి నేర్పసాగెను. బడిలో తులసీదాసునకు గురువు శబ్దమంజరితోపాటు మహాకవి కాళిదాసు రఘువంశములో పాఠములు ప్రారంభించెను. పూర్వపుణ్య ఫలముచే కాళిదాసుగారి రచనలలోని రహస్యంబు, కవితా మాధుర్యము తాను రుచిచూచుచు గురువువద్ద తనకు తట్టిన వివరములు గ్రహించ సాగెను.

కవితా ప్రయోజనములు, రచనలలోని మాధుర్యం క్రమముగా విమర్శించి బుద్ధిబలం పెరుగగా శ్లోకములందలి భావములు తెలియ చదువుచుండెను. గురువువద్ద ముందు శ్లోకముచదివి, పదములు విడదీయును. తరువాత సమన్వయముగా పదంబమరించును. భావం, దాని కర్థం చెప్పించుకొనుచు, శబ్దంలు విడదీసి యేవి యే లింగమో యే శబ్దమో యందులో నేవి విభక్తియో చెప్పును. సమాసములు చెప్పును. మొత్తమంతయు నన్వయించును, తనకు తెలిసినట్లు చందస్సులో నే వృత్తమో, యే గణముతో నా వృత్తమగునో దాని లక్షణముచెప్పి మరల పూర్తిగా శ్లోకమును చదువును. ఇట్లు చక్కగా విద్యను నేర్చు కొనసాగెను.

తన బుద్ధిబలంతో గురువుచెప్పిన శ్లోకములు పఠించుచు ముందురోజు పాఠములు గూడ చదివి సిద్ధపడుచుండును. తోడి విద్యార్థులు వాని చదువున కబ్బుర మందుచుండిరి. గురువు తులసిని చూచి మితిమీరి పొంగుచు వారందరి కన్న పెద్ద గ్రంథముల విషయంలు చెప్పుకొని పోవుచుండ జాగ్రత్తగా వాటి నాకళించుచుండెను.

ఇట్లు మహా కవుల గ్రంథములు, పంచ కావ్యములు నైషధము అలంకార శాస్త్రం తనంతట తాను తనతండ్రి వద్దనున్నవి తీరకనమయంలో చదువుకొనుచుండువాడు. అందలి విశేషములు తనకు తెలిసినవి గ్రహించుచు తెలియనివి గుర్తుపెట్టుకుని సందేహములు తీర్చుకొనుచు యందలి విశేషములు గమనించుచుండెను. ఇట్లు సంస్కృతంలోని గ్రంథములు చదువుచు సంస్కృత భాష యందున్న గొప్పతనం రుచి తలచుకొని పరమానంద మందుచుండును ఇట్లు మహాను భావుడైన తులసీదాసు ధారాళంగా దేశభాషలు మాట్లాడుచు చదువుచుండెను. తండ్రి వద్ద మంత్రములు నేర్చుకొను చుండెను. అతడు నిత్యము స్నానముచేసి సంధ్యాదులు తీర్చుకొని గాయత్రి మహామంత్రమును జపించును పిమ్మట ఇష్టదేవతా స్తవములగు శ్లోకములు చదువుకొనుచు గురువు గారి వద్దకు మహాగ్రంథముగొని మధ్యాహ్నము విశ్రాంతి పొందిన యనంతరము పాఠం చదువును.

ఇట్లు కొన్నాళ్ళు జరిగిన తరువాత తులసీదాసునకు రామకథయన్న రాముడన్న భక్తి ప్రబల సాగెను. రామాయణము వాల్మీకి రచించెను. అయన రామకథలో యెంత గొప్పశక్తి చూపించెనో యదియంతయు చదువుకొని రుచి చూడదలచెను. మరునాటినుండి రామాయణము కొద్దిగా మంచి పట్టులున్న భాగములు తనకు నచ్చినవి తీసి చదువుకొనుచుండెను. పూజ్యమగు రామాయణం పారాయణ గ్రంథంగా నెరిగి దానిని శుచిగానొక్కొక్క శ్లోకమే స్తోత్రాదులైన తరువాత చదువుచు వాల్మీకి మహామునికి జోహారు లిచ్చుచుండును. క్రమంగా షోడశవర్షప్రాయుడైన తరువాత రామాయణము రచనను గ్రహించ మొదలిడెను. రామాయణం ఇరువది నాల్గువేల శ్లోకములు.

గాయత్రీ మంత్రం యిరువది నాల్గక్షరములుగలది. ఆ మహామంత్రంలోని బీజములు యిరువది నాల్గుశ్లోకములతో గాయత్రీ రామాయణం వ్రాసెను ఆ రామకథను ముందుక్లుప్తంగా బాలరామాయణం రచించెను. ఆ పిదప గాయత్రీ రామాయణంలో యొక్కొక్క బీజాక్షరంతో మొదలుపెట్టి వేయిశ్లోకములు వ్రాసెను.

అట్లు ఇరువదినాల్గు బీజాక్షరములకు ఇరువదినాల్గు వేల శ్లోకంలతో రామాయణం మహాగ్రంథంగా వాల్మీకి రచించినాడు. దాని విషయం నేనాలోచించెదనని మంత్రాక్షరముల మహిమ. గొప్ప గ్రంథంలోని యర్థం, యందులో కథలు సవివరముగా ప్రతిదినం కొంచెముకొంచెముగా చదువుచుపొంగిపోవుచుండెను. అందలి రాముడు, నాయకుడు, సీతనాయకురాలు, సోదరులు, సుగ్రీవుడు మొదలగు స్నేహితులు, అంజనేయులవంటి దూతలు యిటు వంటి వన్నియు ప్రత్యేకంగా చర్యసాగించు చుండెను. ఇంటివద్ద తన కుటుంబంవారు మహాభక్తులు, వేద విద్యలు నేర్చిన వారు, ఆచారములు నడుపువారు యితరులుసౌమ్యు కానపడని వారుగా మసలుచుండుటచే మన తులసీదాసుకూడా మంచి కట్టుబాటునకు లొంగిన జీవితంను సాగించుచుండెను. అట్లాతడు విద్యాబుద్ధులుగల్గి తిరుగుచు మంచి పండితుడను పేరొందెను.

అతని విషయము క్రమముగా పల్లెలోనేగాక చుట్టుప్రక్కల యూళ్ళలో గూడ నాతనిపేరు ప్రాకిపది. తులసి యెంత గొప్పవాడైనాడు. చిన్నమొన్నటి దాకా యేదో సామాన్యముగా తిరుగువాడు, ఎవరితోడను మాట్లాడువాడుకాడు. ఇంత గొప్ప తెలివి యెట్లబ్బినదో చిత్రముగదా! యనుకొనుచు యూరిలోనివారు సమయమువను వచ్చి "యేడీబాబూ! కొంచెంసేపు గ్రంథంలను నీ వచ్చినవి వినిపింపవా! విందుమ"ని కోరుచుండెడివారు. ఆ మహా భక్తుడు వారికి సంతోషం కల్గచేయుదలచి రామాయణంలోని భాగములు తనకు తోచినది విన్పి చేయుచుండువాడు. ఇట్లు తీరిక వేళల యూరివారికి రామకథ విన్పించ సాగెను, సాయంసమయమునకు ప్రతిదినమాతని యింటికి జనము ప్రోగుపడసాగిరి.

"మన తులసి రామకథ చదువుచున్నాడు రండని" యొకరికొకరు చెప్పుకొనుచు జనములుచేరి మంచి కాలక్షేపము జరుగుచున్నదని సంతోషించు చుండిరి.

ఈ విషయము సమీపగ్రామముల వారు విని వారుకూడ ప్రతిదినమూ సమయమునకు గుంపులుగా రాసాగిరి. ఇట్లు ప్రజలవలన మంచి పేరండి తులసీగొప్పవాడనియు, బుద్ధిమంతుడు, విద్యావంతుడనియు చెప్పుకొనసాగిరి.

# తులసీదాసు వివాహము

ఆ ప్రాంతమంతయు మన కథానాయకుని కీర్తి ప్రాకినది అతనికి వివాహ వయను వచ్చినది. తమపుత్రుడొక యింటివాడైన చూచి సంతోషించ దలచిరి. తులసి తల్లితండ్రులు పిల్లవాడు పెద్దవాడైన కొలది తల్లిదండ్రులు మునలితనముతో నుండువారగుదురు గదా! అందుచేత తమ వంశం నిల్పుకీర్తిని గడించిన కుమారునకు సంతానం గల్గిన సంతోషింతుమని యెప్పుడు వివాహము చేయుదుమా? యని యెదురు తెన్నులు చూడసాగిరి, పూర్వము రోజులలో సంబంధ బాంధవ్యములు చుట్టుప్రక్క గ్రామములలో తమకు సమీపంగా నుండునట్లు, రాకపోకలకు వీలగునట్లు చూచుకొనుచుండిరి. పూర్వము వారికి పెండ్లియగుటచాలు మంచికుటుంబములోని కన్యక తమ యింటికివచ్చి యింటి పేరు నిలుపునది గావలయుననియు, పెద్దలకు సేనచేయుచు, యింటికి వచ్చిన చుట్టములకు, యితరులకు ప్రేమగా యింత భోజనాదులు పెట్టుగుణం గలదియునై యుండిన చాలుననుకొనువారు.

కట్నంబు కానుకలు కోరేవారుగాదు, కుటుంబమర్యాదలు పాటించువారు, ఇంక పిల్లనిచ్చువారు తమ పిల్లకు కడుపునిండా తిండిపెట్టగలవారు. పదిమంది అంగము గలవారు, యేకధాటిగా నియమములు పాటించి శ్రోత్రియులై యుండువారు, వేదాది విద్యలు నేర్పినవారుగా నున్నచాలు. సిరి, సంపదలు యెట్లున్నను చూచుకొనక వారింటిలో మనపిల్లను పడవేయవలయునని యోచించుచూ గా నుండిరి. అందుచే రాకపోకలకు వీలుగా మంచి కుటుంబం వారు వచ్చి తమ పిల్లనిత్తుమన్న చేసికొందుమని తులసి తల్లిదండ్రులాలోచించుచుండిరి.

ఆ రోజులలో "పిల్లనిత్తుమన్న మాటను" యెగిరి గంతువేసి సమ్మతించుటావారము. ఇంటికివచ్చి ఎవ్వరికి నిత్తుమన్నవారిని కాదన్న కీడని భయంతోను, మర్యాద భంగమును వెనుకాటతో వంకలు పెట్టకుండా సమ్మతించువారు. అందుచే నుభయపక్షంబవారికి వివాహములన్న సులభంగా శక్తిననుసరించి చేయుచుండువారు.

పూర్వపద్ధతిలోనే మన కథానాయకుని కుటుంబమువారుండుటచే వివాహము శాస్త్రీయంగా వైదురోజులగ్నిహోత్రంబతో చేయువలయును ఆ విధంగా చేయించగలవారి కుమార్తెను తన కుమారునకు చేయ నిశ్చయించిరి. ఇట్లు యోచించు సమయంలో సమీప గ్రామంలో నొక పూర్వాచారములు పాటించు కుటుంబం వేదవిదులగు వారితో నిండినదియు సంప్రదాయంనకు లోటు రానిదియు, గౌరవ పద్ధతులతో పొంచుచుండిన వారుత్తమ గుణసంపన్నులు గల వారునగు వారింట నొక కన్యకు వివాహ వయస్సు వచ్చియున్నది. పూర్వం వివాహములు యెనిమిదేండ్లు వయస్సు రాగానే వివాహములు చేయుచుండు పెద్దల పద్ధతిలో వారుకూడా తమ కుమార్తెకు యెనిమిదేండ్లు రాగానే పెండ్లి చేయ దలచిరి, అందుకై వారు వరులకై వెదకపోగిరి. చాలాచోట్లు పూర్వమువారు తిరిగి తిరిగి తమకు నచ్చిన తరువాతగాని పెండ్లి కుమారుని యింటిలోని కడుగిడే వారు కారు.

ఇట్లు తిరుగుచు పొరుగూరు సంబంధం సమీపములోనున్నదియు బుద్ధిమంతుడగు వరుడు గలదియు. విద్యావంతుల కుటుంబమైనదియు, నలుగురు గలిసియున్నగు తులసీదాసు కుటుంబముతైపువారు దృష్టిమరలించిరి. ఒకనాడు శుభ సమయం వార వర్జ్యములు పరిశీలించి కన్యాదాత తనవారితో తులసీదాసు యింటికి వచ్చిరి. ఇట్లు వచ్చినవారిని చూచి వారిపని తనకు తెలియకపోయినను కాళ్ళు కడుగుకొనుటకు నీళ్ళు యిచ్చిరి. దాహము కావలయునా? యని యడిగి దాహమిచ్చి యొకచోట నింటిలో నరుగుమీదచాపపై కూర్చుండజేసి సంతోషముగా పక్కగా యున్నారని నిలిచెను. అయనను వారు కూర్చుండజేసిరి.

పిమ్మట వచ్చినవారిలో మంచి మాటకారి కన్యాదాతకు కావలసినవారు చిరునవ్వుతో నిట్లు మొదలుపెట్టెను. అయ్యా! మేము మీ యింటికి యిందరము వచ్చిన విషయము చెప్పుచున్నాను వినండి. ఈయన మా బావగారు. వారివద్ద నొక కన్యక వివాహంనకు తగిన యీడులోనున్నది. మీ విషయం నేనుకూడా బావగారితో చెప్పినాను,

మీ వద్ద బుద్ధిమంతుడగు వరుడున్నాడనియు, మనకు వారికి సంబంధం కుదురునవియు, సంప్రదాయము గలవారనియు చెప్పినాను, మీ కుటుంబము తులసి పేరు యిదివరకే చుట్టుప్రక్కల గ్రామంబులో ప్రాకినది. అందుచేత మీ కుటుంబము మర్యాదకు, వరుని గుణములకు, విద్యాబుద్ధులకు మేము సంతోషించి మా మేనకోడలను మీ యింటికోడలుగా చేయదలచి వచ్చినాం. మీరు దయయుంచి మా మనవిని సంతోషపూర్వకంగా సంగీకరింప గోరుచున్నామని మొదలిడెను. తులసిదాసు తల్లి తలుపుచాటునుండి యిదియంతయు పరమానందంగా వినుచుండెను. తనకు మంచి కుటుంబంలోని పిల్ల కోడలుగావచ్చి యిల్లు తీర్చిదిద్దుతుందని యూహలు వేయుచుండెను, మన కథానాయకుని తండ్రి యంతయువిని లోన సంతోషించి వచ్చినవారి విషయం పూర్వము తను వినియుండుటచే మనస్సులో సందేహమందక యుత్సాహముతో నిట్లనెను

అయ్యా! మీరు నా యింటికి శుభంనకు వచ్చినప్పుడు నేను కాదందునా? ఇదివరకుకూడా మా పెద్దలు నిట్లనుకొనువారు, కన్యాదానం పొలము గ్రామదానం, నరన తిదానం యుభయులకు నుత్తమలోకములు గల్గించునదిగా మన్నవి. అందుచే నింటికి పిల్ల నిత్తుమని వచ్చినవారిని కాదనగూడదు, నే నొట కం పెట్టను తప్పకుండా సమ్మతింతును, ఈ రోజు మనకందరకు శుభదినంగా భావించెదము, ఇంట్లో యీ విషయం చెవినివేయుదునని లోనికిపోయి భార్యకు యీ విషయం వివరించెను. ఆమెకూడా సమ్మతించెను. వరునితో మాట్లాడవలసిన పని యాకాలంలో లేదు. పెద్దలు సమ్మతియే ప్రధానం. వరుడంగీకరించును. వారికెదురు చెప్పడు.

తులసీదాసు విన్నాడు, తటస్థంగా నున్నాడు పెద్దలయందు మర్యాద పాటించినాడుగదా! ఇప్పుడు యజమాని మాకు సర్వసమ్మతం మీరు మంచిరోజు నిశ్చయించి ఉమ్మురమ్మన్న పిల్లను చూతుము నిశ్చయ తాంబూలం పుచ్చుకొని వివాహముహూర్తం నిశ్చయించుకొందమని చెప్పి, వారిని సగౌరవంగా సాగనంపెను.

కొలదిదినములకు కన్యాదాత యింటివద్దను డి శుభవర్తమానమందెను. వారు నిశ్చయించిన శుభసమయంగల రోజున తులసీదాసు తండ్రి తన ముఖ్య బంధువులకు కబురుచేసి వారితో తాను బయలుదేరి యా గ్రామం చేరిరి. కన్యాదాత, వారిబంధువులు వీరిరాకకై యెదురు చూచుచుండిరి వారి రాకకు పరమానంతమంది; యెదురుగాపోయి గొనివచ్చి పాదప్రక్షాళమునకు నీరిచ్చి యొకచోట గౌరవప్రదంగా కూర్చుండజేసిరి. తరువాత దాహతీర్థంబు పుచ్చుకొనిరి. కన్య తను యలంకరించి వారిముందు కూర్చుండబెట్టిరి. వారాకన్యకను శుభలక్షణములుగల చిన్నదానిని చూచి వారిలోవారలు యిట్లనుకొనిరి. పిల్ల చక్కనున్నది. ఈడు జోడు బాగున్నది. అమ్మాయికూడా చదుకొనుచున్నది. ఇంటిపనులు చక్కగా చేయుచున్నది. బుద్ధిమంతురాలు మనం సంశయం వదిలి "తథాస్తు" యందామనుకొన్నారు.

వెంటనే యాతు పెండ్లివారితో తమ సమ్మతిని తెల్లడించిరి. వారు పరమానందమందారు. వెంటనే నిశ్చయ తాంబూలంబు పుచ్చుకొన్నారు. మగ పెళ్ళివారి సంబంధీకులతో సహా కన్యాదాత యింటివద్ద చక్కగా నారగించినారు. కొంచెంసేపు విశ్రాంతిగొన్న తరువాత పెద్దలగువారిని పిలిపించి, యొక శుభ ముహూర్తం నిశ్చయపరచిరి. వారుభయులా ముహూర్తమునకు సమ్మతించగా లగ్నపత్రికి లందుకొనిరి. ఇరువైపులవారు పెండ్లి ప్రయత్నములలో నుండిరి. శుభముహూర్తమునకు సర్వసన్నాహంబు సమకూర్చుకొనుచు బంధువులతో యిల్లు నిండుగా పరమానందముగా శోభించసాగెను, పెండ్లికుమారునిగా తులసీదాసును

చేసిరి. క్రొత్త బట్టలుకట్టి పల్లకినెక్కించిరి. అందరూ బండ్లమీద పయాణమై పెండ్లికి వెళ్ళిరి.

సుముహూర్తమునకు మంగళస్నానములు చేయించి, పీటలమీద కూర్చుండబెట్టిరి. పురోహితులు వివాహమంత్రములు చదవగా పేరంటాండ్రు చూచి దంపతులను దీవించగా పసుపుబట్టలతో వారు వివాహమైన తరువాత పెద్దలకు నమస్కారములు గావించి దీవనలందిరి. ఐదురోజులు యగ్నిహోత్రములతో వివాహము తంతు నడిచినది.

తరువాత మగపెళ్ళివారు పెండ్లికూతురినితో, ఆమెతైపు చుట్టాలను వెంట బెట్టుకుని మనుగుడుపులు సాగించిరి. ఆడపెండ్లి వారుమనుగుడుపులతదనంతరం పెండ్లి కూతురును, వరుని, వరునికి కావలసిన ముఖ్యబంధువును మనుగుడుపులకు గొనిపోయిరి. ఇట్లు చక్కగా తులసీదాను వివాహము జరిగినది. భార్య యీడేరు వరకు పండుగలను నత్తగారింటికి వెళ్ళుచూ, తన గ్రామములో నున్న భూమిని వ్యవసాయం చేసికొనుచు తన వారితో సంతోషంగా కాలము జరుపుకొనుచుండెను రామాయణ పారాయణం వేదహితవి సదాచారము నడుపుచు విద్యావ్యాసంగం వ్యవసాయంతో కాలం సంతోషంగా జరుపుకొనుచుండెను. కొన్నాళ్ళకు తులసీదాసు భార్య యీడేరినది. పెద్దలు శుభముహూర్తం చూచి దంపతులను కలిపిరి. ఇట్లు వారు దాంపత్య సుఖమనుభవించుచు కాలము జరుపుచుండిరి.

భార్య విద్యావంతురాలైనది. పుట్టినింటివారు చదువును చక్కగ నేర్పిరి మంచి విజ్ఞానంతో, పతియందనురాగముతో, యింటిపనులు చక్కబెట్టుకొను నేర్పుతో, పెద్దలయందు గౌరవము, సేవాభావంతో సంచరించుచుండుటతో నాతడు పరమానందమందెను. విడదీయరాని ప్రేమ బంధముతో వారు మసలు చుండిరి. ఇట్లు కొన్నాళ్ళు సాగినది. ఒక పండుగ సమయం వచ్చినది. తులసీ దాసు భార్య పుట్టింటివారు పండుగ సమయంనకు ముందుగావచ్చి గొని పోవుచు వాతనిని పండుగ రోజుకు రమ్మని యాహ్వానించిరి. అతడు సమ్మతిం

చెను. ఇక్కడ వ్యవసాయపు తొందరలు హెచ్చుచుండెను. తగినట్లు వ్యవసాయపు పనులు చేయకున్న పంటకాలం గదా! పోవగును.

అందుచే భార్యతో వెళ్ళలేదు. వ్యవసాయం చూచుకొనుచు పంటను రాశి చేయువరకు ప్రొద్దుపోయినను యచటనిలిచి కుప్పల నూర్పించుచుండెను. పండగ రోజునకు యెట్లన ముందుగా నత్తవారింటికి వెళ్ళవలయునని యను కొన్నాడు కాని పోగలేదు. బుద్ధి భార్యపై వెళ్ళినది.

## తులసీదాసు రాత్రి ప్రయాణము

తాను భార్యను కలుసుకో దలచెను. రాత్రి ప్రొద్దుపోవువరకు పని కాలేదు గదా! తరువాత నింటికిపోయి భుజించినాడు. మరల పొలములో పని యున్నదని యింట్లో చెప్పినవాడై పొలమునకుపోయి పని పూరమాయించి యత్త వారింటికి పయాణమయ్యెను. రాత్రి చీకటివేళ నొంటరివాడు యితర మాలోచించ కుండా కాలిదారిని నడచిపోవుచుండెను. అట్లు కొలదిమైళ్ళ దూరంలోనున్న తన యత్తవారింటికి నడిరేయి కన్ను పొడచుకొన్న కానరాని దారిలోపడి పోవు చుండెను. ఇట్లాతడు పోయిపోయి యత్తవారియూరు జేరునరికి నడిరేయైనది. ఆ రోజులలో వీధులలోగాని గ్రామములయందుగాని నందెదీపముల వెలిగించి పోయం త్రమే పండుకొందురు. చిమ్మచీకటి నిర్మానుష్యమైన గ్రామములో ప్రవేశించెను. అందరు తలుపులు బిగించి నిద్రలోనుండెను.

తులసీదాసు తన యత్తవారింటికిపోయి వీధితలుపులు తట్టెను. తరువాత కేకలు వేసెను ఎవరూ సమాధానము చెప్పలేదు, పలుకలేదు. ఏమిచేయుదునాయని యోచించసాగెను. వీధిలో యెంతసేపు నిలబడగలడు? చివరకు నటునిటు పరికించి చూచెను ఆ ఇంటికిచుట్టు పహారిగోడగలదు. గోడనంటి రకరకములగు వృక్షం లున్నవి. అవియున్నియు గుబురుగా నుండుటచే తన కానమాలుగ నుండుటకు గోడమీద నల్లగా త్రాచువలె వ్రేలాడుచుండెను. తనకు యింటిలోనికి పోవుటకు మార్గాంతరములేదు. ఇంక తాను యా వ్రేలాడుచుండు త్రాడువంటిదాని పోయం పొందనెంచెను.

వెంటనే యా త్రాడునుబోలిన దానిని పట్టుకుని ప్రహరీగోడ నెగ్రాక పోగెను. అతడు బలవంతంగా దాని యూతగా గోడను దాటులోపల పటపట యా పదార్థము తెగిపోయినది. చివరకాతడు దూకిపోయెను. ఇంటిలోని గది గుమ్మముముందు నిలబడి తన భార్యను పిలిచెను.

నిద్రలోనున్నది భార్య కొంతసేపటికిగాని పలుకలేదు. తరువాత భర్త కంఠము గ్రహించి తొందరగా తలుపులు తీసెను. తీసిన తరువాత తొందరగా చూచినది. శరీర శ్రమతో చెమటపట్టిన యొడలితోనున్న భర్తనుచూచి తెల్లబోయి యిట్లన్నది. మీరు యింతగా నాయానపడి యెట్లు వచ్చినారు? మా తలుపులన్నియు మూసి వేయబడినవిగదా; ఎవరు వీధిగుమ్మం తలుపు తెరిచినారు? ఇంతయర్ధరాత్రి వేళవరకు ఎందులకాగినారు? త్వరితముగా యింతరాత్రి వరకుండకుండా రాలేక పోయినారా? ఇటువంటి కటిక చీకటి, సంచారములేని సమయం యేవిషజంతువైనా దారికడ్డుపడిన యెంత ప్రమాదము మీరింత సాహసం ఎందులకు చేసినారు? ఎంత ప్రమాదం తప్పిపోయినది. నా పసుపు త్రాడు గట్టిదిగాన బయలు పడ్డారు. చాలుచాలునని యని వీధితలుపు యెవరు తెరిచినారు? మీరేగున యింటిలోని కడుగిడినారని నిలదీసి యడిగినది

ఆమె మాటలకాతడు తెల్లబోయినాడు. తన భార్యనుచూచి "నేను ప్రహరీగోడను నీవు వేసిన త్రాడు పట్టుకొని దూకివచ్చినాను. నా భార్యయందలి ప్రేమ నన్నుయింతగా సాహసంయచేయించినదన్నాడు. ఆ మాటలువిని నేనేమిటి? త్రాడు వేయుటయేమిటి? ఇంతవింత. నేనసలు త్రాడు వేయలేదు. అదియేదియో చూచెదను" యని లోనికిపోయి పదవలాంతరును చేతబట్టుకొని దీపముతో తన ముతో తన భర్తను చూచెను. అతని బట్టలన్నియు రక్తమయములైనవి. ఇది చూచి చాలా గాబరాపడిపోయి "యీ రక్తమెక్కడిది? ఏ దెబ్బతగిలినది? మీరు చెప్పుట లేదు." యని శరీరమంతయు తడిమిచూచెను. శరీరముమీద యేమి దెబ్బలు అగుపించలేదు. మీరు దేనిసాయముతో గోడదాటినారన్నది.

అదివిని యిదివరలో చెప్పిన సమాధానం చెప్ప భర్తతో నాయిల్లాలు ప్రహరీగోడ దగ్గరకు చేతిలాంతరుతో వెలుగు చూచుచు ముందుకుపోగినది. గోడ వార రెండు మొండెములుగల నల్లత్రాచుపాము శరీరము కనిపించినది. అత

ముక్కగా గోడనంటియున్నది. అది తలభాగం. ఇది అంతయు తులసీదాసు భార్య చూచినది.

## తులసిదాసును భార్య మందలించుట

తన భర్తవైపు తిరిగినది. ఈ రక్తము మహాసర్పమునకు సంబంధించి నదిగా తెలియుచున్నది. ఈ రాత్రివేళ ప్రహరీ గోడమీనున్న నల్లత్రాచుపామును త్రాడుగా భావించినారా? నేను మీకై వేసినానని యూహించినారా? ఎంత ప్రమాదము దాటినది. ఈపాటికినేను వైధవ్యము భారం వహించు యోగము పరమేశ్వరుడు తప్పించినాడు ఇది నా భాగ్యం. ఆ రాత్రివేళ త్రాచుపామో! త్రాడో! యేదియోగూడ తెలియలేదా? ఆహ్హా! ఎంతటి యజ్ఞానం పొందినారు? మీరు విజ్ఞానులనియు, విద్యావంతులని యనుకొన్నాను, కాని యింతటి కామాంధ కారములో నున్నారనుకోలేదు. ఎంతదారుణం? ఎంత సాహసం! చాల గొప్పపని చేసినారు. నాకు శరీరములో వణకుపుట్టుచున్నది. ఈ మహా కృష్ణసర్పం ఎంత సౌమ్యమయినది. మీకు తన శరీరం నిర్పించినన్నుద్ధరించినది.

ఇది చాలు మావాండ్రు విన్నచో కన్నచో నన్నెంతగా నిందింతురు? ఎంత చులకనగా చూతురు? నీ పెనిమిటి చదువంతయు నిమిషములో తేలిపోయి నదవరా? నేమ లోకువగానా? యింక మనము కిక్కురుమనకుండా లోనికి పోవుదము ఈ బట్టలు వదిలివేయుడు దొడ్డిలోమన్న భాండములో ముంచి రక్తపుమరకలు పోగొట్టెదను వాటినిగోడకార వేయుదును. మరునాడు వారడి గినచో చీకటిలో బురదలో పడినారు. బట్టలు తడిపినానని మావాళ్ళతో చెప్పె దను యనిలోనికి చెయ్యిపుచ్చుకొని గొనిపోయి బట్టలు విప్పించి తనవద్దనున్న భర్తవస్త్రములు తనతోగొని వచ్చినవి కట్టబెట్టినది. అతడు వదిలిన బట్టలు భాండములోని జలములో మునిమి యారగట్టెను.

తరువాత తనభర్తను గదిలోనికిగొని పోయి శయ్యపై కూర్చుండ బెట్టి మృదువుగా మధురముగా వాతని మనస్సునొవ్వకుండా యిట్లు ప్రేమతో మాట్లాడసాగెను. ఏమండీ! త్రాచుపామును త్రాడుగా భ్రమించి మీరు ఎట్లుండ

గాదు? సాహసము యెల్లవేళల పనికివచ్చునా? అర్ధరాత్రివేళ ప్రయాణము లెవరు చేయుదురు?

జారులు, చోరులు ఈ నిశా సమయంలో తిరుగువారు గాని గృహస్థులు తిరుగుదురా? ఒక జాము ప్రొద్దుపోయిన తరువాత చీకటిలో ప్రయాణము ప్రమాదము గానిరాదా? చాలు! చాలు, ఎప్పుడు యిటువంటి దారుణ ప్రయాణము చేయకుడు. నాయందు మీకు మమకార మున్నచో సాయంత్రమునకు రాలేకపోయినారా? ఇది యెంత ప్రాణ భయము? మృత్యువుతో కోరి కోరి చెలగాటము లాడుదురా? అబ్బా! మగవారైన మాత్రమునకు మరణ భీతి యుండదా? మరణము స్త్రీ పురుషులకు సమానమే! ఆడుది యబల యని భయస్థురాలని యనుకొనకుడు. అందరికీ జీవితము మీద గల తీపి స్వాభావము గదా? ఏమనుకొని యిట్లు వచ్చినారు? నావారు విన్న నా బ్రతుకు నవ్వులపాలు గాదా? ప్రమాదము వచ్చిన నా బతుకు గంగపాలు గాదా? మీ సాహసము నాకొంప తీయలేదనెను.

అది విన్నాడు తులసీదాసు తిరిగి యిట్లున్నాడు ఇల్లాలా! నేను యింత యర్ధరాత్రియే భయములేకుండా యొకే నిదానముమీద యెట్లు రాగలిగినా ననుకున్నావు: ఇది యంతయు నీవు నాకు భార్యగా నుండి నన్ను మనస్సు రంజిల్లునట్లు చూపిన యనురాగమే యింతకు కారణము నా భార్యను చూడకుండా యుండలేక పోయితిని రాత్రి కాదు పగలుకాదు నీతో నుండిన జీవితమునకు విలువలేదు, నేను నిన్ను విడచి యుండలేక యితిని. నిన్ను చూడగా బుద్ధి మెరుపువలె మెదలినది దానితో గ్రామములోని పనులు పూర్తిగావించుకొని యింత సేపటిలోగాని ప్రయాణించ వీలుపడలేదు. నీవు నన్ను మనసార ప్రేమతో చూచిన యనురాగ బంధమునా హృదయమునకు బంతె వేసినది.

ఆ బంతెలో పడిపోయినాను. దానిని తప్పింప తరముకాలేదు. ఏ వనిత తన భర్త హృదయములో నిర్మలమగు స్థాన మాక్రమించుకొని యుండునో యామె ధన్యురాలు, పూజ్యురాలుగా చెప్పదగును. నీకు నేనటువంటి పూజ్య

స్థానము నా హృదయములో గల్పించి యుంచినాను. ఇది నా యాంతరంగిక విషయ మన్నాడు.

ఇట్లు భార్యాభర్తలు తమ తమ హృదయములలోని విషయములు వెల్లడించుకొనుచు మాట్లాడపొగిరి.

తరువాత తులసీదాను భార్య భర్తనుచూచి యిట్లుపదేశము చేయ నారంభించినది. "ఏమండీ! మీరు నన్ను మీ హృదయమున స్థానమిచ్చి గౌరవించుటచే నేను ధన్యురాలయినాను. మీ మనస్సు నాయందు లగ్న మగుటచే మన దాంపత్య జీవితము గౌరవనీయమైనదని చెప్పగలము? అయినా నేను యింకొక యడుగు ముందునకు వేయుచున్నాను. భార్య యెవరు! భర్తయెవరు? దానికి గురించి మనము చర్చించుట మనధర్మము భార్య యొక శరీరధారి! భర్త యొక శరీరధారి! ఇద్దరు యెంతకాలము కలిసి యుందురు! జీర్ణించినది శరీరము, ఈ వయస్సు ఈ కామ సుఖము లెంత కాలం పొగును. శరీర బింకము గల్గినంతసేపు పొగును. వయస్సు జారుట కారంభించిన తరువాత మన యిద్దరి మమకారము శరీరకారణములతోను, యింద్రియ బలం తగ్గిన కారణముతోను నన్నగిలిపోవదా?

మన కండ్లముందు యెందరు ముసలితనముతో బాధపడుచున్నారు, ఎందరు రోగములతో కీసికొని బాధపడుచున్నారు? ఎందరు మరణం చెందు చున్నారు? ఎవరు యిచట శాశ్వతంగా నున్నవారు లేరుగదా! అనగా మన మోహము, మన శంసారములు నరీర బలం ననుసరించిగాని మరొక గతిగా నడుచుటలేదు. అటువంటి శరీరములు మనం ధరించినాము? ఈ శరీరములతో నున్న కాలం మాత్రమే మన యనుబంధములు, యనురాగమును ఇందులోనుండి యీ జీవులు దాటి యెవరికి వారే యమునాతీరేకదా! ఎక్కడినుండియో వచ్చి నాము ఎక్కడికో ఈ శరీరములు వదలి పోవుదుము.

ఇది శాశ్వతము గాదు గదా! మనకు శాశ్వతమేమి? ఈ శరీరములతో చేసిన సత్కర్మలయొక్క ఫలితమే ఈ శరీరము ధరించినందులకు ఫలితము గదా! అందుచే మన మన్యోన్యంగా నుండి ఈ మోహ విషయం శరీరకమయిన దానిని వదలివేయుట మంచిదిగాదా! ఎక్కువ మీకు నేను చెప్పదగినదానవా?

అయినను నేను నా హృదయం విప్పి మీతో చెప్పుచున్నాను. నేను భార్యా శరీరముతో నున్న జీవిని. నేను యీ శరీరంలో నున్నంతసేపు భార్యనే! ఈ శరీరంనుండి నేను యనుబడు జీవిదాటి పోయినప్పుడు యీ శరీర మెవరు? యది కదలునా? మెదలునా? అట్టి కదలికలేని శరీరం నాశించి ప్రాణములపై యాశవదలి ఇంతపని చేయుదురా? యీ శరీరం రక్తమాంసంలతో నిండినది. మల, మూత్రాది దుర్గంధమునకు మూల మయినదని మీ రెరుగరా? అట్టి పరమ నీచమగు యీ శరీరంను మీరు కామ సుఖముల కపేక్షింపక యిహ పర సుఖములందుట మన మిద్దరి కలసి కృషిచేసి సత్యమగు తేజమును చూచు మార్గము వెదకుకొనుట మంచిది కాదా? ప్రపంచంలో శాశ్విదములుగాని యీ శరీర సుఖములు మితమగు కాలను మాత్రమే యనుభవించి విడిపోదుము. ఇట్లు యనుకూలమాగు పరిస్థితులలో మనమిద్దరం యున్నత భావములతో యుత్తమ గతులందుటకు యత్నించుట మంచిదికాదా?

ఎంతకాల మున్నను యీ సంసారంనకు తుదిలేదు, సుఖంలేదు. స్థిరముగాదు, అందులకై మీరు నాయందున్న మమకారం యటుంచి యట్టి మమకారం మనలను సృజించి భగవానుడగు రామచంద్రునిపై యుంచినచో సమస్తం సుఖవంతమై యిహలోకంలో కీర్తివంతమై పరమందు శాశ్వత స్థానమై తరింపజేయగలదు రామనామము. మహా మహిమగలిగదా! దానిని స్మరించిన పాపములు పటాపంచలగునుగదా! రామ కటాక్షమందిన వారు యెందరు మహా మహాత్తైదివ్యసానముల ప్రవేశించినారు వారివలె మన దంపతుల కీరి స్థిరము కావలయును.

తులసీదాసు మహానుభావుడు. రామ భక్తాగ్రేసరుడను కీర్తి మీరు సంపాదించుకొనుడు. మీ కారణంబయిన నాకు మీతో నుత్తమలోక వాసము గల్పించుడు నా యందుండు తెర్రి భ్రమలు తొలగించుకొనుడు. నేటి మన మిరువురము స్నేహితులమై యుండదగును." 294-592 RAM

## తులసీదాసు విరాగము - గంగాతీర వాసము



మీరు మరియొక విధంగా భావించవలదు. ఇంతవరకు సంసార సుఖం అనుభవించినాము. యీనాటి యీ సందర్భముతో మనము చీకటుల నుండి వెలుగు త్రోవలోనికి పోయి ప్రయాణింతుముగాక ! మన ప్రయాణములో శ్రీరామచంద్ర దర్శనం గల్గును. స్వామి ప్రసాదముతో దివ్యలోక నివాసం నకు యోగ్యమగు సత్కర్మ లీ జీవితములందు కాలముచేసి పరమ పదమందుదుముగాక! యెందుల కింక మీకు సంశయము? నేను మిమ్ములను వదలియుండను. మీతో నుండెదను. మన మిద్దర మా జీవాంతం స్నేహితులమే! వట్టి స్నేహితులము కాదు, ప్రాణమునకు ప్రాణమైనట్టియున జీవితములు సాగించవలయును. శ్రీరామ ప్రభుని దయ సంపాదించవలయును. ఇది మన జన్మ సాఫల్యమునకు పెద్ద త్రోవగా నెరుగుడు రెండు. తెల్లవారిని తరువాత మీరు చేయవలసిన పనిని యిప్పుడే నిర్ణయించెదను వినుడు. 12200

మీరు యింటి మొగము పట్టుట మానుడు. యీ శరీరమునకు తగిన సత్కర్మ కలాపములో మునిగితేలుడు. మీరు గంగా తీరమునకు పొండు. అచట నొక పర్ణశాల నిర్మించుకొనుడు. గంగా స్నానము గావించుచు శ్రీరాముని జపించుచు కూర్చుండుడు. రామ దర్శన మగుదాక మీరు యింటి మొగము పట్టనని శపథం చేయుడు. మీరు దీక్ష పూనినచో కార్యసాధనం చేయగలరు. రాముడు తప్పక దర్శనమియగలడు. మనవాంఛ తీరును. అంతవరకు నా మాట గాని మన యిల్లు, సంసారముగాని తలపునకు రానీయకుడు. నేను కూడ మీరు

వచ్చువరకు రాముననై భరతుడు దీక్షపూనినట్లు దీక్ష పూని కార్యము నడుపుదును.

ఇల్లు దిద్దుకొనుచు బ్రహ్మచర్య దీక్షలోనుండి శ్రీరాముని స్మరించుచునే యుందును. ఇంటి ప్రశంస మీ కక్కరలేదు. ఇప్పుడే నాయందు ప్రమాణం చేసి దీక్ష బూనుడు. నన్ను మీానంద పరవదలచినారు, పూజ్య స్థానం కల్పించి మీ హృదయం నుంచుకొన్నారు గాన దానిని స్థిరపరచి యీ రూపములో నుంచు కొనుడని యుపదేశించెను.

ఆ యుపదేశంను తులసీదాసు వినెను. పరమానందమంనెను. ఇల్లాలి మాటకు తిరుగులేదని నిశ్చయించుకొనెను. భార్యతో సమాధానంగా నిట్లు చెప్పెను.

ఇల్లాలా! మన జన్మలు తరించగల యుపదేశం చేసిన నీ మాటలు విశ్వసించెదను. నేను చదువుకొన్న చదువునకు ప్రయోజనం పొందించెదను. నిన్ను నాలో గురువుగా భావించెదను. స్నేహ ధర్మం పాలించమన్నావు గాన పూజ్య ధర్మంగా నిన్ను హృదయమున నిల్పి శ్రీరాను కటాక్షంనకు ప్రయత్నం గావించెను. రామ దర్శనం కాకుండా నేను నీ యానతి ప్రకారం యిల్లుకాని, సంసారంకాని, భార్య విషయమని కాని చింతించను. నేను రేపే బయలుదేరి పావన గంగా తీరమున నాశ్రమం నిర్మించుకొని యందు శ్రీరాముని యందుంచిన మనస్సుతో యితరము పాలించకుండా తదేక ధ్యానంతో నుండి నీ ప్రమాణంగా దీక్షబూని శ్రీరాముని దర్శింతును.

నేను మాట తిరుగనని ప్రమాణం చేసినాడు. యా రాత్రి వారట్లు నియమం నిద్దరు పాలించి పరమాహ్లాదంగా కాలం జరిపిరి. తెల్లవారిన తరువాత యింటినుండి తిన్నగా తులసీదాసు భార్య సంతోషంతో నెదురురాగా బయలుదేరి గంగాతీరమునకు ప్రయాణ మయ్యెను. పరమ ప్రీతిగా హృదయమునకు కెరట ములు కొట్టునట్లు సంతోషం పుల్లింతలు కొట్టుచుండెను. ఎందులకో యెరుగని హృదమానందంతో గంగాతీరమునకు తులసీదాసు వచ్చి యచట పరిశుభ్రమగు

ప్రశాంత స్థలం చూచుకొన్నాడు. దానిని పరిశుభ్ర పరచినాడు తనతో తెచ్చుకొన్న కమండలముతో గంగాజలం గొని తెచ్చినాడు.

ఆ ప్రదేశమంతయు శుభ్రపరచుకొన్నాడు. పిమ్మట సమీపారణ్యం నుండి కొన్ని కర్రలు తెచ్చుకొని పాతి యా పైన చిన్న కర్ర లడ్డంగా తీగలతో బిగించి యొక శాల నిర్మించుకొన్నాడు, అంతవరకు యెండ తగుల కుండాపైన బట్టవైచి యుంచినాడు. మెల్లగా నా యడవిలో పడిపోయిన యాకులను పెద్ద వాటిని పైన పరచినాడు.

ఇట్లు క్రమంగా నాశ్రమం నిర్మించుకొని యందుండ సాగెను. ఆ యాశ్రమంలో పూవుల మొక్కలు, తులసి మొక్కలు పూజా ద్రవ్యములుగా నుంచుకొనుటకు వేసి పెంచసాగెను. అతడు నిత్యము గంగాస్నానం గావించుకొని స్నాన సంధ్యాదులు తీర్చుకొని రామనామము జపింప సాగెను. రానురాను రామనామ జపము వృద్ధిచేయుచు తరువాత తీర్థ జలం తన యాశ్రమంనకు నంటి యున్న యొక పెద్ద రావిచెట్టు మొదలున పోయుచుండెను. అతడు ప్రతిదినము యిట్లు తీర్థ జలం పోయుచు కొన్ని సంవత్సరము లట్లు సాగించుచుండెను. నానాటికి తులసీదాసు హృదయపక్వం గానొచ్చెను. ఇట్లు యోగ నిష్ఠలో నాతడు సంవత్సరములకొలది యుండి తపోశక్తి పెంచసాగెను. లక్ష్యం చక్కగా కుదిరినది. తదేక ధ్యానంతో రామనామం జపించు చుండెను.

ఇంతవరకాయన కుపదేశించిన వారు లేరు. గురువుగా నెవరు నిలబడ లేదు. రామనామం జపించుచుండుట తప్ప మంత్రజపం అంగన్యాసాదులతో చేయుట యెరుగడు. పరమ భక్తితో నిర్మల హృదయంతో నాతడుండెను. భార్యా విషయ మిట్లాలోచించెను. నేనెంత సుకృతం గత జన్మములో చేసినాను. నాకు ఇటువంటి భార్య దొరికినది. భార్య యనగా భోగమునకు తగిన వస్తువుగా లోక సామాన్యము భావింతురు. భార్య యన్న నేమో నాకు నేటికి తెలియ వచ్చినది. నా హృదయ పీఠంలో గురు స్థాన మాక్రమించి నన్ను యిటువంటి మహా బలం గలదైన తేజమును దర్శింప జేసినది. నా కుటుంబ భారం తాను మోయుచున్నది నన్ను స్వేచ్ఛగా రాము సేవలో నుంచినది.

ఇటువంటివారు యింటికి దీపములు, ఇప్పుడిప్పుడు నా భార్య యొక్క యుపదేశంలోని బలం రామనామం జపించుటలో పెనవేసికొని పోయినది. నా జన్మకు సఫలిత యా దివ్యోపదేశంగదా! యని భార్యను తలచుకొని చేసిన మహోపకారమును స్మరించుచు కాలం జరుపుకొనుచుండెను.

## తులసీదాసు బ్రహ్మరాక్షసుడు

ఆశ్రమం నిర్మించుకొని నిత్యం గంగా స్నానం చేయుచు ప్రతినిమేషం రామనామం జపించుచు జపానంతరం తీర్థజలం శేషించినది యశ్వత్థ వృక్షం మూలంలో పోయుచుండగా "రామ నామ" జప తీర్థంలోని మహిమ యెక్కువగా తెలియుటాకని కంటబడలేదు కాని దాని మహిమ మా యశ్వత్థవృక్ష మూలం నుండి పెద్ద కొమ్మలకు పలవలకు నావలకు పట్టినది. దాని బలం వృక్షమునకు పట్టినది. అది పట్టుటయెట్లో తెలియకపోయినను దాని మహిమ విచిత్రముగా బయటపడినది. ఆ వృక్షముమీద చిరకాలంనుండి యనగా కొన్ని వందల సంవత్సరముల కాలంగా నొక బ్రహ్మరక్షస్సు దానిమీద నివాసంగా నుండపొగెను. ఇంత కాలంనుండి యది తులసీదాసు చేయు రామతీర్థ జలం ప్రభావంతో పూర్వజన్మ జ్ఞానం కలిగినది. ఆ శరీరం వదలుకాలం వచ్చినది. అట్లుండగా యొకనాడు ఇట్లు జరిగినది.

ఆనాడు మధ్యాహ్న సమయంలో తులసీదాసు జపం పూర్తిగావించి శేషమున్న తీర్థ మా రావిచెట్టు మొదటపోసెను. ఇట్లు పోసినవెంటనే యా రావిచెట్టు నుండి వింత రూపంతో బ్రహ్మరాక్షసుడు క్రిందకు దూకివచ్చి తులసీదాసు కాళ్ళు పట్టుకొని సాష్టాంగమువడి యిట్లనెను. "మహాత్మా! నా పూర్వజన్మ ఫలితం మీ రూపంగా నాకు దర్శనమిచ్చినది. నేను ధన్యుడనైనాను. నా పాపిష్టి జన్మ ఈ రోజుతో తీరిపోయినది. నేను దివ్యమగు జన్మలోనికి పోవుచున్నాను. నాకై విమానం వచ్చును. నే నందుండి దివ్యలోక వాసమునకు నీ ధర్మమున పొందగల్గుచున్నా"నని మ్రొక్కిన యాతని చూచి తులసీదాసు తెల్లబోయి యిట్లనెను.

"ఇదేమి వింత? నీ వెవ్వరవు? ఈ చెట్టుపై యెన్నాళ్ళనుండి యున్నావు? నీ కెందుకిట్లున్నావు? నీ చరిత్ర యేమి? నాకు సవిస్తరంగా చెప్పుము. నావల్ల నీకే యుపకారం జరిగినది? వినగా వినగా నీచరిత్రము వింతగా తోచుచున్నది. వినిపింపు" మనగా నాతడిట్లు ప్రారంభించెను.

## బ్రహ్మరాక్షసుని చరిత్రము

"అయ్యా! నేను నా చరిత్రము వినిపింతును వినుము. నేను ద్రవిడ దేశంలో జన్మించిన వాడను. నా తలిదండ్రులు మంచి ప్రఖ్యాతిగలవారు. నా తండ్రులు నాల్గు తరములనుండి వేదం నేర్చి పెక్కుమంది శిష్యులకు పాఠములు చెప్పి వారి నందరను వేద పండితులుగా చేయుచుండిరి. మేము శిష్టాచారంతో కుటుంబం నడుపుకొనువారము. మాకు దుర్వ్యసనము దుర్గానంబు లేవు. ప్రతి దినం నగ్నికార్యంబు తీర్చుచు పర్వకాలములందు యిష్టులు చేయుచు పెద్దలు సంపాదించి పెట్టిన మాన్యములమీద వచ్చు నాదాయంతో నతిథి యభ్యాగతుల నాదరించుచు యన్నదానం చేయుచు గొప్ప కీర్తి గాంచినది మా కుటుంబం. మేము యిట్లుండగా నేను పుట్టిన తరువాత నాకు నుపనయన వయస్సు రాగా నుపనయనం నా తలిదండ్రులు గావించిరి. ఉపనయనానంతరం నన్ను వేద పాఠమున కొక గురువువద్ద ప్రవేశపెట్టిరి. నేను నా గురునివద్ద భక్తి వినయంతో వేదం వల్లెవేయసాగితిని. ఇట్లు చాలకాలం వేదవిద్య నభ్యసించుచుండు కాలములో నాకు నొక సహాధ్యాయుడు కలిసెను. అతడు నాతో కొంతకాలం చక్కగా నడిచెను. మే మిద్దరం కొన్నాళ్ళు వేదంను వల్లెవేసిన తరువాత బుద్ధిమారినది.

"దేశాటనం చేయవలయు ననియు కాశీక్షేత్రం దర్శింపవలయునని వాంఛ బయలుదేరి యిద్దరం గురువుగారివద్ద శలవుపొంది ప్రయాణమైనాము. వేదం చదివిన వారముగాన మా విద్యను ప్రదర్శించుచు పాదత గౌరవం అందుచు కాలక్షేపం చేసినాము. అట్లు మహారాష్ట్రం, ఘూర్జరదేశం సంచారంగావించి కొంత ధనం సంపాదించుకొన్నాం. ఎవరి ధనం వారు దాచుకొని తిరుగుచు కాశీక్షేత్రం ప్రవేశించినాము.

గంగాస్నానం చేసి విశ్వేశ్వర, వినాయక, అన్నపూర్ణాది దేవతలను దర్శించి యొక తీర్థ పుత్రునియింట బసచేసినాం. అయనతో నుండి తీర్థవాసులకు పాయపడుచు వారివలన ధనం కోరకుండా వారీయగా పుచ్చుకొనుచు యచట స్థిరముగా నున్నాము.

మే మట్లుండగా యా తీర్థవాసుని పుత్రిక యొకతె యున్నది. ఆమె మాతో చనువరితంగా నుండసాగెను. కొన్నాళ్ళకు నా స్నేహితుడు యా కుమారితో సంబంధ మేర్పరచుకొనెను. వారిద్దరు రహస్య విధంగా సంచరించు చుండగా నేను దానిని సహించలేకపోయినాను. ఈ విషయంను నా స్నేహితుని పిలిచి "నీవు గురునితో తుల్యమగు వారింట గురుద్రోహ కార్యం చేయరాదు. నీ ప్రవర్తన నచ్చలేదు. పరకాంతను యందులో గురుతుల్యుడగు మహానీయుడు మన కాశ్రయమిచ్చిన యా పుణ్యాత్ముని యింట నుండి గురుద్రోహం చేయుట తగనిపని. నీవు జాగ్రత్తగా మసలుకొమ్మ"ని నేను యనేక విధంల నిందించితిని. దానితో వానికి నాయందు కోపము పెరిగినది. నన్ను చంపివేయుటకు తన బాధ నివారించుకొనుటకు మనస్సులో వంతల్పించు కొన్నాడు కాబోలు నేనే మెరుగను. దీర్ఘకోపం చాల ప్రమాదం గదా.

అట్లు వాని మనస్సులో మెదలుచుండు దుర్బుద్ధి నేను గమనించలేదు మే మిద్దరం తిరుగుచున్న కాలంతో నన్ను మట్టుపెట్ట దలపు వారిద్దరిలోను ప్రవేశించినది కాబోలు. ఒక పర్వదినమయం సాయంత్రంవేళ స్నానాదులు చేయదగిన గ్రహణకాలం. చీకటితో ధనార్జనమునకు తిరుగుచు గంగలో నిలబడి మంత్రములు చదువుచుండగా నన్ను యితరులెవరు గమనించని రీతిలో గంగ లోనికి నెట్టివేసెను. జలవన్మరణం గంగలో జరిగినను నాకుండిన వయస్సు కాలం. శరీరం జరుగని హేతువుచే జలవన్మరణ ప్రారబ్ధముతో నేను చనిపోయి ఈ బ్రహ్మరాక్షసుని రూపమంది వేదము చదువుచు తిరుగసాగితిని. నేను వచ్చు వారిని పోవువారిని బెదిరించుచుండు కాలమున నొక మహామునిని బెదరించితిని.

ఆయన నా విషయం గ్రహించి గతజన్మ విషయము గుర్తించి జాలిపడి

యిట్లనెను: నీవు గంగా తీరంన పవిత్రమగు నశ్వత్థ వృక్షంపై నిల్చి యుండుము. కొన్నాళ్ళ కొక మహనీయునివలన ఈ శరీరము వదరి దివ్య శరీర మందెదవు యన యాజ్ఞాపించి పోయెను. నీ వాయన కుపకారంగా సహాయపడుం. వేద పఠంతో దివ్యజ్ఞానం గలిగియుండుమని ననూరార్చెను.

నాటినుండి నేను యీ పిప్పల వృక్షంపై వేదం చదువుకొనుచు మౌనంగా నిందే యున్నాను. నేను శరీరం వదలగల కాలం నీదర్శ మున వచ్చినది. నేను ఇంత యీ పాడు శరీరం వదలెదను. నాకు దివ్యశరీరం పొందగల సమయామాసన్నమైనది. నా దోషములు వేదపారాయణంతోను, నీవు రామనామ జపతీర్థ శేషం నా నిలయమగు యీ మహావృక్ష మూలమున పోయుటచే నేను పునీతుడనుగా నైనాను. నాకు నీవలన మహోపకారమైనది. ఈ శరీరం వదలుటకు, దివ్య దేహము దాల్చుటకు నీ పుణ్యమే మూల కారణమైనది. నేను నీవు చేసిన యుపకారము మరువజాలను. నీ వలన యీపాడు శరీరం బాధ, కాంతి పొందినది. అంతవరకు మంటలు వికృతరూపం నన్నావహించి యున్నవి. ఒక మహానుభావుని దయవలన దివ్యదృష్టితో మీ రాకయు, మీవలన నేను యీ శరీరం వదలుటయు. దివ్య దృష్టితో ముందురాగల శరీరంను గ్రహించ గల్గితిని.

ఇప్పుడు యిన్నాళ్ళ నుండి నీవు చేయు రామనామ జపం సఫలత గాంచినది, కాని గురుని యుపదేశంతో తారక మంత్రం గ్రహించిన గాని శుద్ధి యేర్పడదు. నాకు యిటువంటి మహోపకారము గావించిన నీకు సమర్థుడగు గురువును చూపించెదను, అయన నారద మహాముని, ఆ మహాముని నారయణునకు ప్రియ భక్తుడు, అయన ఎరుగనిది లేదు. నీ కుమహోపకార మా మహానుభావుడు చేయునవగా విని. "ఓ పుణ్యాత్మా! నాకు నారద మహాముని దర్శన భాగ్యం కల్గింతువా? నేను మానవుడను, అయన దేవముని, ఇది యెట్లుపొగును? సందర్భం కుదరలేదన్నా"డు. అదివిని యా బ్రహ్మరాక్షసరూపు డిట్లన్నాడు.

నారద మునీంద్రుడు త్రిలోక సంచారి. ఏ లోకంలో తిరిగిన యాలోక వాసుని రూపము ధరించును. వీణాగానము గావించును, ఎక్కడకో వెళ్ళవలసిన పనిలేదు ఈ దారిని బ్రాహ్మణ రూపముతో రేపు పోవును, ఆయన వెంటబడుము నీకు శుభమగునని చెప్పెను, తన శరీరమతడు చూచుండగా వదలి దివ్య దేహంతో విమానమెక్కి పోయెను.

# నారద దర్శనము - తారక మంత్రయోగము

ఇట్లు చెప్పిన యా బ్రాహ్మణజీవి దివ్య శరీరంతో పోయిన తరువాత తులసీదాసు యిట్లాలోచించెను. నా జన్మకు ఫలితంగా యీ సంఘటన సమ కూరినది. నా భార్య రూపంతో కేవలం రామప్రభువు తన యనుగ్రహం నాయందు నిల్పి యిట్లు గంగాతీర వాసం రామనామ జపం, నా జపసిద్ధికి తగినట్లు నారద మహామునీంద్ర దర్శనం, యిన్ని యెట్లు సమకూర్చినాడో! యెంతటి యాశ్చర్య విషయము. నాకు మహోత్తరమగు సాయం చేయుటకు యీ పిప్పలివృక్ష ప్రాంతమునందు వర్షకాలయు, నాశ్రమము కట్టుకొను యోగం వచ్చినది కాబోలు. ముందేమి జరుగునో శ్రీరామ ప్రభుని దయగా భావించ తగునని యా రాత్రి తనకు రేపు జరుగు సన్నివేశమును గురించి తదేక ధ్యాన ంగా నుండెను. తెల్లవారు జామునవే లేచి నిత్యకృత్యంబులు తీర్చుకొని గంగా స్నానమాచరించి శుచిర్భూతుడై యుండెను.

ఇట్లాతడు దారి కని పెట్టుకొని యెవరు తిరుగబోలని యరణ్య మార్గంను బట్టి వచ్చుచున్న యొక వ్యక్తిని, వీణ భుజంపై పెట్టుకొని వెళ్ళుచు వినురుగా నడుగుచుండు యొక బ్రాహ్మణుని తిలకించెను. ఇట్లు చూచి యాతడు వినురుగా తన ప్రక్కనుండి పోవుట గమనించి యాయన వెంటనంటి మహావేగంతో తాను కూడా పోవుచుండెను. కొంత దూరం పోయిన తరువాత వెనుదిరిగి చూచి తనను వెంబడించు తులసీదాసును చూచి కసరి "నీ వెవడవు? ఎందుకు నన్ను

తెంబడించుచున్నావు? పో: వెనుకకు పో: రావల"దని విసురుగా తీవ్రంగా చీద రించెను తులసీదాను నారద మహాముని చూచి కాళ్ళు పట్టుకొని యిట్లన దొడగెను.

"మహానుభావా: నీవు దేవమునివి. నేను యే శరణ్యము లేని సామాన్యజీవిని. నిన్నాశ్రయించి రామతారక మంత్రోపదేశమందద దలచితిని. నాపున్నెం కొలది మీ దివ్యదర్శనము లభించినది. ఇది నా పూర్వ జన్మ ఫలం మిమ్ము నాకుపదేశం చేయు వరకు వదలను. నన్ను తరింపజేయుడని" ప్రార్థించెను.

నారదుడు యెంతయో కసరెను, చీదరించెను. తొలగ ద్రోసెను. ఎన్ని చేసినను తన్ను వదలని తులసీదానుపై ప్రేమ కలిగినది. తన కాళ్ళు పట్టుకొని వదలకుండా యున్న తులసీదానుపై ననురాగము కలిగి యిట్లనెను. నీ వెవరివాడవు? నన్ను యెందులకు వెంబడించినావు? నీ యుద్దేశమేమి? ఏమి వాంఛించితివి" యని ప్రశ్నించెను.

తులసీదాను చేతులు జోడించి "నేను సామాన్యమానవుడను. శ్రీరామ చంద్ర దర్శనం కోరి యిక్కడ రామనామం జపించుచున్నాను. నాకు తారక మంత్రం ఉపదేశించగ మిమ్ము ప్రార్థించుటకు వేచియున్నాను. నాయందు దయయుంచి రామ తారక మహా మంత్రం పది విధావంగా మీరుపదేశింప సాష్టాంగ పడుచున్నా" ననెను. "నేను యెవరినని యడుగుచున్నావు. సామాన్య బ్రాహ్మణుడను. నీ కుపదేశం చేయ సమర్థుడనా? ఎందులకి వెర్రి యాశని" యన్నాడు.

స్వామీ: మిమ్ము నే నెరుగను. చూతజాలను. నా పుణ్యంకొలది యీ రావిచెట్టుపై నుండిన బ్రహ్మరాక్షసిన్ను మిమ్ము గురించి చెప్పినది. నా వలన తాను తరించినా నని యు, నన్ను తరింపజేయుటకు నారదమునీంద్రుడు రేపు ఈ దారిని పోబ పుచ్చుకొని వెళ్ళుననియు, నీ వాయన పాదములు పట్టుకొని తారక మంత్రోపదేశం మందుమని నంబాచెప్పి విమానమెక్కి వెళ్ళిపోయెను. నిన్నటి

మంది తమ రాకకై యెదురుచూచుచున్నాను. నా జన్మ తరించినది. దయయుంచి నన్ను కృతార్థుని చేయుమని వేడుకొనెను. తులసీదాసు పుణ్యం గొప్పది. శ్రీరామ చంద్రస్వామి యనుగ్రహం పొందగల పుణ్యం చేసిపెట్టుకొన్నాడు. నారదమునికి దయ గలిగినది. అతని ప్రార్థన మంగీకరించినాడు. అట్లంగీకరించి సమాధానంగా నిట్లన్నాడు.

"భక్తాగ్రేసరా నీవు కోరిన కోరిక తగినదే! నన్ను రామతారక మడిగినావు. నీయందు నాకు ప్రేమ దైవబలంచే కలుగుచున్నది. నేను నీకు రామతారక మంత్ర ముపదేశింప తగిన సామర్థ్యం గలవాడను కాను. నీకు వలసిన తారక మంత్రోపదేశకర్తను తెలియజేయుదును, నీ వాయన నాశ్రయింపుము. నీకు తప్పక కార్యజయం, శ్రీరామ దర్శనమగు" ననెను.

అది విని తులసీదాసు నారదమునీంద్రునితో నిట్లనెను. స్వామీ! నాకోరిక తీర్చక దాటించుటకు యిట్లు మాట్లాడుచున్నారా? నేను మీవాడను. నాయందు దయయుంచి నన్ను త్రోసిపుచ్చకు డనెను. నారదుడు నవ్వి యిట్లనెను. నాకు నీయందు ప్రేమ కుదిరినది. నీవు యింకొక విధముగా నెంచకుము. నేను మహా మహుడు నాకన్న శ్రీరామ భక్తాగ్రేసరుడు నిరంతరము రామ తారక మంత్ర నిష్ఠలోనున్న జగత్ప్రసిద్ధుని నీకు గురువుగా చేయదలచినాను. నీ యోగము గురించి యోచించియే నీ కొరకై యీ దారిని ఈ వేషముతో వచ్చినాను. లేకున్న నారు యిచ్చుటకు రాజనిలేదు. నీయందు పుత్ర ప్రేమతో నేను భావించి చెప్పు చున్నాను వినుము. ఆ మహాను భావుడెట్లు నీకు దొరకునో వివరింతును వినుము. నీవు భవిష్యత్తులో గొప్పవాడవగుదువు. శ్రీరామ దర్శనం కలుగును. నీ గురువు నీకు శ్రీరాముని గొనివచ్చి చూపును. వినుమన్నాడు.

పిదప యిట్లారంభించెను, ఇచట కవతి దూరములోనేగదా కాశీపట్టణ మున్నది. ఆ పట్టణములోని వారందరూ భక్తిపరులే! వారిజన్మ విశేషముతో కాశీవాసులైనారు. అట్టి కాశీపట్టములో తూర్పుభాగమున గంగా తీరమునందొక

బ్రాహ్మణ గృహం గలదు. అతడు సదాచార సంపన్నుడు. మహా భక్తుడుగా నుండును. ఎందరు వచ్చినను లేదనకుండా అన్నదాన మా పట్టణములో చేయు ప్రముఖులలో నొకడు. వారింట నిత్యం భక్తజనులు రామనామ సంకీర్తనములు గావించుచుందురు. అట్టి బ్రాహ్మణ గృహములో సాయం సమయంలో శ్రీమద్రామాయణము పురాణ కాలక్షేపం జరుగు చుండును. కొన్ని వందలమంది భక్తులు వచ్చి శ్రీరామ చరిత్రమాలకించుచుందురు.

వారిలో మనకు కావలసిన ముఖ్యుని వివరింతును. వినుము. పురాణం ప్రారంభం కాకుండా ముందుగావచ్చి యీకాస్యమూల కూర్చుండు ముసలి బ్రాహ్మణుని గుర్తుపెట్టుకొనుము. ఆ బ్రాహ్మణుడు పురాణం ప్రారంభించినది మొదలు చివరవరకు తలవంచి కన్నీళ్ళు గార్చుచు చివర పురాణమునకు స్వస్తి చెప్పిన తరువాత లేచి బయలుదేరును. అతడు ముసలి వాడైన వేగములో సంత వాడు లేడు. లేచి చీకటిపడు సమయంలో వినవిన నడచుచు నీ యాశ్రమమునకు కొలది దూరములోనున్న కాలిబాటనుపట్టి చీకటిలో పోవుచుండును. నీవు చేయు

వలసినది యిప్పుడు చెప్పుచున్నాను. ఆయన బయలుదేరగానే నీవాయనను వెంబడించుము. నీ యాశ్రమముగుండా పోవుచుండును. నీ యాశ్రమము దాటువరకు వెనుకపాటుగా నా మహాత్మునితో నడువుము. తరువాత దట్టమగు నడవిలో బడి పోవుచుండగా వెంటాడుము. ఆయన కొంతకు తిరిగిచూచును. నిన్ను చూడగానే "నీవెవడవు? నాతో యీ చిమ్మచీకటిలో నెందులకు వచ్చెదవు? పో పొమ్మని కసరును. గద్దించును. హూంకరించును. నీవు భయపడకుము. రెండుకాళ్ళు పట్టుకొని చుట్టివేయుము. నిన్ను యెందులకు నా కాళ్ళకడ్డుపడెదవని యప్పుడు ప్రశ్నించును. నాకు శ్రీరామతారక మహామంత్రము నుపదేశించుడు. అంతవరకు వదలనని గట్టిగా పట్టుకొనుము.

అది వినిన తరువాత నేనుపదేశించుట యెట్లు? నేను సామాన్యుడను బ్రాహ్మణుడనని యనును. అప్పుడు యిట్లు చెప్పుము. మీరు నన్నను గ్రహింపుడు. నాకు గురువుగా మీరుండవలయును. మిమ్ము నేను వదలను. మీరు సామాన్య

బ్రాహ్మణులుగారు, దేవకోటిలోనివారు భూలోకములో జనులను నుద్ధరించుటకు సామాన్య వేషములు ధరించి తిరుగుచుందురు. మీరుకూడా దేవతా పురుషులుగాని సామాన్య వృద్ధ బ్రాహ్మణులుగారు. మీ విషయం నేను వినియే మిమ్మాశ్రయించుచున్నాను. మీరలంత రామతారక మంత్ర పరాయణులు నా గురుదేవులు మారుతి పుత్రులుగా నెరిగితి ననుము. ఆయన గద్దించి "నీకు నా విషయము నెవరు చెప్పినారని" ప్రశ్నించును. నీ విట్లు చెప్పుము.

స్వామీ! మీ విషయము నేను తెలియ సమర్థుడనుగాను. సమర్థులైన నారద మహామునీంద్రులు చెప్పి మిమ్మాశ్రయించమన్నారనుము. ఆయన వెంటనే "యెక్కడున్నాడు నారదుడనును. ఈ శరీరము నాకెందుకని చితి పేర్చుకొని శరీరము వదలినాడనుము. లేకున్న మనలిద్దరను తోకతో చుట్టి త్రిప్పి కొట్టును సుమా! ఇది మార్గము. నీకు వాయునందనుడు సంశత రామతారక ఉపదీక్షితుడు గురువుగా చేయుదును. భయపడకుము. ఆయన చాలా దయశాలి. తనపేరు చెప్పుకొన్నవారికి మితిలేని బలము, ధైర్యము, శౌర్యజయము, రామచంద్ర దర్శనభాగ్యము, రోగరహిత జీవితము తప్పక కల్పించును. ముందు నీ హృదయము పరీక్షించుటకు హూంకరించును. నేను పంపించానన్న నీకద్దు చెప్పడు. లేకున్న నీవు రామదూతను గ్రహించగలవను కానడు. నేను పంపినా నన్ను నిన్ను శోధించిగాని పంపనని యెరుగును. నీకు మహాయోగము పట్టనున్నది. లేకున్న నేనగుపించను నీకు గురువును కుదర్చను. మున్ను రామాయణ గ్రంథకర్త వాల్మీకిని ప్రోత్సహించినది నేనే. ఈనాడు నిన్ను రెండవ వాల్మీకిగా చేయదలచి యా బ్రహ్మరాక్షసుచే చెప్పించినది నేనే. నీవు రామకథామృతము భక్తి తన్మయత్వముతో విచిత్ర గతులతో వ్రాసి చిరకీర్తి పొందగలవు. ఇది నాయాశీర్వచనమని దీవించి నారదుడు వీణాగానము చేయుచు శ్రీహరి స్మరించుచూ పోయెను.

తులసీదాసు యిది యంతయు కలయుకాని చెప్పరాని సంతోషము, భయము, గగురుపాటుతో పోవసాగెను. నేనేడ! నారద మునీంద్రుడేడ! మానవ

పుత్రుడాయనను దర్శింపగలడా? ఆయన దయ సంపాదించగలడా? నేను నిజముగా సంపాదించినానా? నాకప్రయత్నంగా నీ యాశ్రమజీవితము, నారద వృత్తాంతం, మహాముని సందర్శనము యెన్నో జన్మల పుణ్యఫలము ఈ జన్మలో చేసినదికాదు. నేను మహాముని నాశ్రయించగా నాకు తగిన గురుడని వాయు నందనుని విషయం వివరించెను. ఇది యంతకన్న కష్టసాధ్య విషయంగాదా?

నేను మానవలోకంలోనున్నను దేవలోక వాసులతో సంబంధము యెంత ఘనమో! నేను వర్ణింపగలనా? శ్రీరామ సేవా దురంధరుడు హనుమంత మహాశయుని గురువు పొందగల యోగ్యత నారదమహాముని వలనగదా ప్రాప్తించ నున్నది నేను ధన్యుడను. నా కార్యకోర్కె తీరగలదని యత్లే నిష్ఠగా తన యాశ్రమమునకుండెను.

## ఆంజనేయస్వామి తారక మంత్రోపదేశవిధి

మనస్సులో పరిమితానందం నందుచుండెను. ఒకప్రక్క భయం కూడ వేధించుచుండెను. నేను మహావీరుడగు నాంజనేయస్వామిని కలుసుకొన గలనా? నా కార్యసాధనమగునా? నేనందులకు తగినవాడనా? అట్టి మహాగురుని పాదమంటి రామ తారక మంత్రముపదేశమందగలనా? ఇది కలలోని మాటగా నెరగవలయును. కాని మహామునీంద్రుడు నాకు యోగము లేకున్న యింతగా వివరముగా చెప్పునా? తప్పక సంసార విమోచనమందగలను. శ్రీరామచంద్ర స్వామి దర్శనము నా గురుదేవుడు చేయించే తీరును. సందియములేదని ఏదేక ధ్యానముతో నున్నాడు. ముందు తానాచరించవలసిన విధానమును యోచించు చుండెను. మరునాడు తులసీదాసు వేకువలేచి గంగా స్నానముచేసి శ్రీరామ నామము జపము గావించుచు సాయం సమయము వరకట్లే యుండెను.

సాయం సమయమునకు కొంచెము ముందుగా బయలుదేరి కాశీనగరము లోనికి ప్రవేశించెను. నారద మహామునీంద్రుడు చెప్పిన గుర్తులననుసరించి తిన్నగా గంగతీరమునందున్న బ్రాహ్మణ గృహమునకు పోయి దూరముగా

నిలబడి నిదానించుచుండెను. ఇంతలో పురాణ శ్రవణమునకు శ్రోతలు వచ్చి చేరుచుండిరి. ముందుగా మునీంద్రుడుచెప్పిన మహాశ్రోత వృద్ధ బ్రాహ్మణుడువచ్చి యీశాన్యదిశలో మూలగా కూర్చుండెను. స్త్రీ పురుషాదులు రామనామ సంకీర్త నలు చేయుచుండిరి. పిదప పురాణమారంభించిరి, తులసీదాసు కూడా వినువారితో నొకప్రక్కగా తాను కూర్చుండెను, రామాయణము వినుచుండెను. పురాణము సమాప్తమైన తరువాత నందరు లేచిపోయిరి.

తానెవరికై చూచుచున్నాడో యా మహామహుడు వృద్ధబ్రాహ్మణ రూపధారి లేచి వినవిన నడచుచు పోవుచుండెను. తులసీదాసు వాని ప్రయా ణము నడక విమర్శగా చూచుచు దూరదూరముగానుండి తన యాశ్రమము వరకు వచ్చి యందు ప్రవేశించెను. తాను నారదమునీంద్రులవారి బోధ నంతయు జ్ఞప్తికి తెచ్చుకొనుచుండెను.

ఇట్లు కొన్నాళ్ళు సాయం సమయమునకు తన స్థానమునుండి బయలు దేరి పురాణము జరుగు గృహమునకు పోయి వినుచుండు వారి మధ్యలో కూర్చుండి శ్రీరామ చరితామృతమును చెవుల పండువుగా వినుచుండెను. ఇట్లాతడు భయము, సంతోషముతో నెట్లా మహాపురుషుని దర్శనము చేయుదునా? మహా మంత్రములు పొందుదునా? యని తహతహలాడుచుండెను. చివర కొకనాడు సాహసముగా గురుదేవుని కలుసుకొనవలయును మహామంత్ర ముపదేశ మంద వలయునన్న పట్టుదల వహించెను. ఆనాడు మునుపటికన్నా హెచ్చుగా రామ నామ జపము గావించెను. సాయం సమయము కావచ్చినది. కాశీనగరమునకు ప్రయాణమయ్యెను. గంగ గట్టునయున్న చరిత్రాత్మక గృహమునకు జేరెను, అందరికన్నా ముందుగా వచ్చి కూర్చున్న మారు రూపమువానిని గురుదేవుని పరికించిచూచెను.

ఇదివరలోవలెనే ప్రవేశించి కూర్చుండెను. పురాణము జరుగుచుండెను. ఈ మహాభక్తుడు కన్నీళ్ళు గార్చుచు పురాణము జరుగుతీరుకట్లే యుండెను. పురాణమాఖరున వ్యస్తియైనది. అందరూ లేచి వారి వారి తావులకు పోవుచుండిరి. ఈ వృద్ధబ్రాహ్మణుడు కూడా లేచినాడు. ముసలితనము పాటించని నడకతో

చరచర పోవుచుండెను. మన కథానాయకుడా దినమున సాహసముగా వెళ్ళిపోవుచున్న బ్రాహ్మణుని వెంటబడి పోవుచుండెను. [illegible] తలవంచుకొని పోవుచుండగా వెనుకబడి పోవుచు తన యాశ్రమం దాటెను. అట్లు దాటిన మహనీయునితో తాను కూడా నడుగులో నడుగు కలుపుచు పోవుచుండెను.

కారు చీకటిగా నున్నది. దట్టమైన పొదలు, మహావృక్షములు క్రూర మృగములు నిండిన ప్రదేశంగా నున్నది. సంశయం విడచి మారుమాటాడ లేకుండా పోవుచుండెను. కొంత దూరం పోయినతరువాత మహాభక్త శిఖామణి వెనుదిరిగి చూచెను. తన్ను వెంబడించుచున్న తులసీదాసును చూచి యిట్లనెను.

ఎవరు నీవు? యీ చీకటిలో నాతో వచ్చుచున్నావు? ఇది మహారణ్యము తెలియదా? ఎందులకు ఈ సాహసంతో వచ్చినావు? పో! పో! తిరుగు కావా? లేదా? యన్నాడు. ఒక్క యురుమురిమినట్లుగా నాంజనేయస్వామి యన్నాడు. అది విని గడగడలాడుచు తులసీదాసు మిమ్ముల వదలజాలను. మీరు తప్ప నాకు వేరుదిక్కులేదు. మీరు మహానుభావులు, దివ్యమగు శ్రీరామ తారక పారాయణులుగా నెరిగితిని. నేను మిమ్మాశ్రయించగా వచ్చుచున్నాను. నాయందనుగ్రహముంచి శ్రీరామచంద్రస్వామిని దర్శనం చేయించగల తారకమంత్రం నా కుపదేశం గావించుడు. నేను మిమ్మాశ్రయించుచున్నాను. నావంటి దీనుని దయతో చూడగల మహామహులు మీరు. మిమ్ము వదలజాలను. నా హృదయ తాపం మిమ్ము దర్శింపగా తీరుచున్నది. మీరు దయాస్వరూపులు. మీవంటి వారి దర్శనం పూర్వార్జితపః ఫలంగా భావించుచున్నాను. నన్ననుగ్రహింపుడని కాళ్ళు పట్టుకొని గట్టిగా విలపెట్టెను.

ఆంజనేయస్వామి బ్రాహ్మణరూపంతో నున్నాడుగదా! దానికి తగినట్లే యిట్లు మాట్లాడసాగెను. ఓయీ! నీవు మెవరినిచూచి యెవరనుకొనుచున్నావో! నేను ముసలి బ్రాహ్మణుడను. పెద్ద తనంలో శరీరం వణుకు చున్నది. ఎవరూ లేనివాడను. ఒంటరి జీవితమీ యడవులలో చేరి జరుపుకొను చున్నాను. నీవు నా వంటి ముసలివాని వలన యే ప్రయోజనం పొందెదవు? నాకు లేనిపోని బెడద తెచ్చిపెట్టెదవా? యీ బతుకు సాగనీయవా? ఎందులకీ యాతన? చెప్పినమాట వినుము. వినకున్న నిన్ను ఏమి చేయుదునో చూడుమని గద్దించెను.

ఆయన మాటలు విన్నాడు తులసీదాసు. మనస్సు కొంత కుదురు పరచుకొన్నాడు. మనం శాంతముగా సమాధానం చెప్పవలెను. నేను కూడా యెరుగనట్లు యెదుట నిలచి నాకు మంత్రోపదేశం చేయుమందును. నా స్వామి విని నీకెవరు చెప్పినారనును. అప్పుడు కథనంతయు ముందు పెట్టెదను. నా వాంఛితము తీర్పు మందుననుకొని యిట్లనెను.

మీరు పెద్దవారు. వృద్ధ బ్రాహ్మణులు జప తపములందు దాటితేరిన వారు. శ్రీరాముని సేవ బాల్యమునుండి చేసి పండిన మహానుభావులు బ్రాహ్మణ మూర్తులు, వేద ధర్మవిదులు, బహు శాస్త్రవేత్తలు, ఈశ్వరాను గ్రహ పాత్రులుగా నుండకుందురా? ఎంత పెద్దవారైన యెంత భక్తియుక్తులై యుందురు. నన్ను దయయుంచి, శిష్యునిగా భావించి చేరదీసి మంత్రోప దేశము గావించుడని ప్రాధేయపడెను. స్వామికి మనస్సులో దయ గలిగి నది. కాని తన్నాసవాలు పట్టినవాడా? భక్తియుకతో మనస్సులో నుంచుకొని మాట్లాడుచున్నాడా? వాని హృదయము గ్రహింతునని యిట్లారంభించెను. "ఏమయ్యా! నన్ను పట్టుకుని యెందుకు వేధించెదవు? నీకెందులకి బాధ? ప్రపంచములో నెందరో యుండగా నన్ను పట్టుకొని యెందులకు పీడింతువు. నా దగ్గరకు రాకుము. పో! పో! యెందులకి పీడ" యని యొక్క త్రోపు త్రోసెను.

అతడా త్రోపు త్రోయగా తులసీదాసు తూలిపడి మరలవచ్చి కాళ్ళు పట్టుకొని "మీరు యెంత త్రోసినను పట్టన్నను మిమ్ములను వదలజాలను. దయతో నన్ను చూడుడు, మీరు తప్ప నా కోరిక యింకొకరు తీర్పలేరు. మీ వచనమే నా వాంఛితము తీరవలయునని నిశ్చయించుకొన్నాను. నన్నెంత త్రోసినను మిమ్ము వదలజాలను. నా మాటను త్రోసివేయక దయతో చూడుము. నేను మిమ్ము సామాన్యులుగా భావించలేదు. మీ విషయము నేను తెలియవలయునని యే యున్నాను. మీ సేవతో నేను తరింతును నా దీక్ష భంగము చేయుకుడు. మీకు నన్ను దాటిపోకుడు. మీ పుణ్యముతో నేను గట్టెక్కగలను." యని స్వామి గారి పాదములపైబడి వ్రాలెను.

అతని చూచి యనుగ్రహము నంది వాయునందను డిట్లనెను. నీకి పట్టుదల యెందులకు? నాకేమి పన్ను? నా నుండి నీవేమి గ్రహింతువు కెర్ర శ్రమలో పడినావు? ఎందులకింత బాధ? సమర్థుడగు గురువును వెదకికొని నీలోని కోర్కెతీర్చుకొమ్మనెను.

దానికి తులసిదాసు తాను గ్రహించిన విషయము బయట పెట్టదలచి యిట్లనెను. స్వామీ! మీరు సామాన్యులుగారు. మిమ్ము నేనొక మహానుభావునిగా గ్రహించినాను. ఇప్పుడు లోకములో తిరుగుట కెవరికి తెలియ బడకుండానుండు టకి రూపంలో నున్నారు. అత్యంత రామసేవాపరులుగా మిమ్ము విన్నాను. నా పున్నెముకొలది యా మహాత్ముడు మీ విషయము నా కెరిగించినాడు. నా కోరిక మీ వలన తప్పక తీరుననాడు. మిమ్ము గుర్తించుకొని పట్టుకొమ్మని చెప్పినాడు. ఆ గుర్తుతో మిమ్ము గ్రహించి మీ పాదసేవ చేసి మంత్రోపదేశ మంద దలచినాను. ఇది నా విషయమనగా విని, యాతడెరిగినదేదియో వినదలతును చెప్పుకొని పొమ్మని నా విషయము నీకెతడేమి చెప్పినాడన్నాడు. దాని కాత డిట్లు చెప్పెను. ఓ స్వామీ! మీ సంగతి వారు చెప్పినది వినుండనెను.

కాశీ పట్టణములో గంగాతీరమున తూర్పు తట్టున యొక బ్రాహ్మణ గృహము గలదు. అక్కడ ప్రతిదినము రామాయణము పురాణ కాలక్షేపము జరుగుచుండును. ఆ కాలక్షేపమునకు పెక్కుమంది భక్తులువచ్చి విని సంతోషించుచు పోవుచుందురు. వారందరూ రామనామ సంకీర్తనము గావించు చుందురు. స్త్రీ పురుషాదు లెల్లరూ మహాభక్తులు వారి భక్తి పారవశ్యము వర్ణించలేను. ఆ వచ్చిన జనములో చెప్పుకోదగ్గ వ్యక్తి యొక్కడు ముఖ్యుడున్నాడు. పురాణము ప్రారంభమునకు ముందుగావచ్చి యాకావల మూలలో నొదిగి కూర్చుండును. ప్రారంభమునుండి కన్నీళ్ళు గార్చుచు పురాణము పూర్తియగుదాక యుండి విన విన లేచి నడచి పోవు వృద్ధ బ్రాహ్మణుడు నీకు మంత్రోపదేశము చేయ సమర్థుడు. ఆయన వలన నుపదేశమందమనెను.

నేనా మాటలువిని వెంటనే యానాడు కాశీ నగరమునకు వచ్చి యా బ్రాహ్మణుని యింటికి వచ్చితిని మిమ్మందరనీ చూచితిని. ఆయన చెప్పిన గుర్తుల

ననుసరించ మీదారిని పోవుదురని మీ వెంటబడుటకు కొన్ని రోజులు యత్నము చేసినాను ఈనాటికి నా యత్నము సఫలమైనదన్నాడు.

అది యాంజనేయస్వామి యిట్లన్నాడు. నన్నే యింతగా పట్టుకొని మంత్రము పొందమని యన్నవారెవరు? వాని సంగతి కనుగొందును లేని పోనివి చెప్పి పెట్టి నిన్ను మోసగించునా? అతటి మాటకారి, మోసతరియెవరు? నాకు చెప్పుము. వానిని కలుసుకొని విలదీసి యడుగుదునని హూంకరించెను. తులసీ దాను విని భయపడక "స్వామీ! నేను మీముందు యేమి దాచగల్ను? మిమ్ముగూర్చి మహానుభావుడు మహా రామభక్త శిఖామణి యాంజనేయస్వామిగా చెప్పినాడు. మీరు నిజముగా వాయుపుత్రులు నావంటి దీనులను కాపాడగల మహా ప్రేమ మూర్తులు. నేను వినాను నన్ను మోసగించగా తలపకుడు. నాయందు దయ యుంచుడని యెంతో భక్తి, వినయములు ప్రకటించుచు ప్రార్థించెను. దానికా వానర ప్రభువు సంతోషమంది వాని కభయహస్తము శిరమునబెట్టి "సరియే! దానికేమి? నీవు నన్ను యెట్లు గ్రహింపగా నాతడు తెలియజేసెను. అంతవాడె వరు? ముందు నాకా సంగతి చెప్పుమనెను.

నాదీన చరిత్రము మీకు విన్పింతును వినుడు. మీరెరుగనిది లేదు. కాని మీ ముందు నా విషయం చెప్పుగొనుట నాకు శ్రేయస్కరము, వినుడు నేను తులసి యనునామము వాడను. కామబలముతో నర్ధరాత్రం మహాసర్పమును త్రాడుగా భావించి గోడదాటులోన యా పాము మూడు ముక్కలుగా తెగినది. రక్తపు ధారలతో నా భార్యను పిలువగా వచ్చి నా రక్తమయమగు బట్టలుచూచి భయ పడి వస్త్రములు వదలజేసి నాకు తత్త్వోపదేశము చేసినది. శ్రీరామచంద్ర దర్శనా నంతరముగాని నావద్దకు రావద్దని యంతవరకు నిల్లు దిద్దుదువని చెప్పి పంపి నది. గంగా తీరములో పర్ణశాల నైచుకొని రామనామము జపించ సాగితిని.

జపానంతరము తీర్థమొక యశ్వత్థ వృక్షమూలమున పోయుచుంటిని. దానిపై చిరకాలముగానున్న బ్రహ్మరక్షస్సు క్రిందకు దూకి నాకు నమస్కరించి మీ రామనామ జపతీర్థ మహిమచే యీ పాడు జన్మ పోవుచున్నది. నాకు దివ్య విమానము వచ్చును. నీ యుపకారము మరువజాలను. దీనికి బదులుగా నొక యుపకారము చేయుదును వినుము.

నీవు చేయుచున్న రామనామ జపమునకు తగిన గురూపదేశమందుము. శ్రీరామ తారకమంత్ర ప్రభావముతో ఘనుడవయ్యెదవు. గురూపదేశములేని మంత్రం పట్టుగా పనిచేయదు. కావున నీకు తగిన గురుని నేను చెప్పెదను. నీవాయన నాశ్రయించుము తరింతువని యిట్లనెను. ఈ దారిని రేపు నారద మహా మునీంద్రుడు వచ్చును. ఆయన భుజమున వీణ ధరించి ముసలి బ్రాహ్మణ రూపమున యీ దారిని పోవును. నీవాయన పాదములు పట్టుకొని మంత్రోపదేశ మందుమని యా శరీరం విడచి దివ్య శరీరం దాల్చి యాతీవి వెడలిపోయెను. మరునాడు నారద మునీంద్రుని రాకకై యెదురు చూచుచుండ మీవలె వినవిన నడచిపోవు మహనీయుని పాదములంటి శ్రీరామతారక మహా మంత్ర ముపదేశం చేయుడని కాళ్ళ వ్రేళ్ళ బడితిని. ఆయన నన్ను చూచి జాలిపడి యిట్లనెను.

ఓ వెర్రివాడా , నను పట్టుకొన్న యేమి లాభము? నేను తారక మంత్రో పదేశం గావించుటకు తగిన వాడనుగాను. అందులో ప్రముఖుని వలన నీవుపదేశ మందుము. నీవు తరించగలవు. నారాక నీ శుభంనకు చిహ్నం. నాడు వాల్మీకి దగ్గరకుపోయి రామ మంత్రం చెప్పి రామాయణం వాయునట్లు ప్రోత్సాహ మిచ్చితిని ఇప్పుడు నీకు నీ పుణ్యం కొలది నేననుపించితిని. నీవు రెండవ వాల్మీకి వయ్యెదవు. రామకథా గ్రంథం గొప్పది. నీ వలన వ్రాయబడును. అందులకై నీకు తగిన శక్తి ప్రసాదించగల మహా మంత్రోప దేశకర్త యా బ్రాహ్మణుడెంత గొప్పవాడనన్నాను అది విని యా బ్రాహ్మణుడు సామాన్యుడు గాడు మహా శక్తివంతుడు.

రామచంద్రుని సేవలో నిరంతరం నిల్చి మహాతారక మంత్రం దివా రాత్రములు జపించుచుండు మహానుభావుడు మారు రూపంతో నున్న రామభక్తా గ్రేసరుడు హనుమంత ప్రభుడని యప్పుడు చెప్పినాడు గురుదేవా! నన్ను వదలక దయతో శ్రీరామప్రభు మంత్రముపదేశించి తరింపజేయుమని దీనంగా ప్రార్థించెను.

అది విని వాయునందనుడు వద్దుకొరికి "నీకు నన్నప్పగించినాడా? ఏడీ యా నారదుడు? నేను వాని శిరం పగులగొట్టెదనని గదాయుధముతో చతుర్బాహువులతో, సూర్యతేజముతో తులసీదాను ముందు నిలబడెను. ఇందులో రహస్యం తన భక్తునకు నిజరూప దర్శనం నిచ్చుట కపట కోపం ప్రద

క్షించుటయు మారుతి చేసెను. దానికి తులసీదాసు భయపడి స్తుతులొనరించి నాతో మీ విషయము చెప్పి చితి పేర్చి యందులో దుమికె నన్నాడు. పకాలున స్వామి నవ్వి "చితిలో దూకినాడా? నారదదు నా వలన నీకు మంత్రోపదేశము చేయించదలచినాడు. అతని కోరిక నేను తీర్చెదను. నీవాంఛితము నేరవేర్చి నా భక్తునిగా, శిష్యునిగా చేసుకొందును. ఇప్పుడు రాత్రి సమయము ఈ సమయములో మంత్రోపదేశము రాక్షస జాతికి చెల్లినది.

నీయందు నాకు ప్రేమ గల్గినది నేను నీకు శ్రీరామ తారక మంత్రోపదేశము గావింతును. ఇప్పుడు వెనుకకు మళ్ళుము. రేపటి రోజుదయము నా గురువుగారు సూర్యభగవానులు ఆయన యుదయించి బారెడు ప్రొద్దుయెక్కు సమయములో చక్కని సమస్త కాంతులు చిమ్ము చుండును. వేడివెల్లు బాగుగా బంగారు కిరణములు ప్రసరించు వేళ నేను నీయాశ్రమమునకు వచ్చెదను వచ్చి నీకు శ్రీరామ తారక మంత్రముపదేశింతును సిద్ధముగా నుండును నీవు సంశయింప పనిలేదు. నేను మాట యిచ్చిన తిరుగను. నిన్ను నావానిగా చేసికొందును నా ప్రభువు శ్రీరామచంద్రునికి చెప్పి నీకు దర్శన మిప్పింతును. మీ భార్యాభర్తల నొకచోటునకు జేర్చెదను రామ సేవలో మునగజేసి తరింప జేయుదునని చేతిలో చేయివేసి యభయమిచ్చి యంతర్ధాన మందెను.

ఈ విధముగా తులసీదాసు శ్రీరామ భక్తుడుగా నాంజనేయ స్వామి శిష్యుడుగా మారెను. గురువువద్ద శలవుగొని తన యాశ్రమమునకు ఉత్సాహముతో బయలుదేరెను. అతనితో నూతనమగు యుత్సాహము, బలము గురుదర్శనాంతరము శరీరము మీద కన్పించసాగెను.

ఆ రాత్రి తులసీదాసునకు నిద్రలేదు. తన హృదయములో పట్టరాని సంతోషము బయలు దేరినది. దేవతలకు దొరుకని, నా గురుదేవుడు పూర్వ పుణ్య ఫలముతో మంత్రోప దేశమున కంగీకరించి దయచూపినాడు. నన్ను వంటి ధన్యుడొకడుండడు. పరమ దేవతా స్వరూపుడు శంకర తేజోమూర్తి నాగురుదేవుడాంజనేయ ప్రభువు. శ్రీరామ చంద్రుని దివాణములోనికి ప్రవేశించుటకు

నాగురుదేవు నన్నుజిగావలయును. ఎవరూ మా స్వామిని వ్యతిరేకించ జాలరు వ్యతిరేకించిన వాలుమును చుట్టి మహాసముద్రములో మూడు మునుపులు ముం: గలడు. లోకములు దద్దరిల్ల సంచరించగలడు. నా ప్రభుని చరిత్రము మహ మహిమలతో గూడినది. అట్టివాడు నాగురుదేవుడు తేపు నా వివాకమునకు యెట్లు వచ్చునో? విశ్వరూపముతో వచ్చునో, బ్రహ్మణ రూపముతో వచ్చునోయని యోచింవ సాగెను.

అట్లారాత్రి గురుధ్యానముతో నుండి లేచి దంతధావనాదులు తీర్చు కొన్నాడు. గంగానదిలో చక్కగా మంత్రపూరితముగా స్నానము చేసినాడు. సంధ్యా వందనాదులు తపము సాగించినాడు. అంతకు పూర్వమే గంగ నది జలములతో తన యాశ్రమము శుద్ధిపరచినాడు. అక్కడ నున్న రెండు దుంగలు తెచ్చి యందుంచినాడు. అంతకన్న పీఠము లెక్కడ దొరకును? ఇట్లు విశాలమగు దుంగముక్కలపైద తామ సంపాదించిన దుర్భాసనము వేసి యుంచెను. గురుని రాకకై వేచి యుండెను. తన గురుదేవుడెట్లు వచ్చునో యని యోచనలో నున్నాడు. జాము ప్రొద్దుయెక్కునరికి మెడలో రుద్రాక్ష మాలికము విభూతి రేఖలతో నున్న మొగము పింజెలుతీర్చిన ధోవతి కట్టు. పెద్దంచులుగల వల్లె వాటుతో తలవంచి యాశ్రమములోని కడుగిడి యిట్లనెను.

తులసీ! యిటురా! తూర్పుమొగముగా కూర్చుండుము. ఆ చమనం చేయుము నేను సంకల్పము చెప్పెదవని గోత్ర నామములతో గురుదేవుని నామ ముతో సంకల్పం నశపి యంగన్యాస కరన్యాసములతో శ్రీరామ తారక మంత్రం కుడి చెవిలోనుపదేశించి పల్కించెను.

ఇట్లు తులసీదాను మహానుభావుడగు హనుమంతస్వామి వలన శ్రీరామ తారక మంత్రోపదేశమంది గురువుగారి పాదములు పట్టుకొని "గురువర్యా! తమ దయవలన మహామంత్రం పొందినాను. ఈ మంత్రాధిష్ఠాన దేవతా శ్రీరామ చంద్రప్రభు దర్శనం నాకిప్పించ గోరెదను. ఈ శిష్యుని వాంఛితము తీర్చ ప్రార్థించెదనని నినయముగా వేడుకొనెను. అంజనేయ ప్రభువుని "ని" తులసీ! నీకు సీతాసమేత శ్రీరామచంద్ర దర్శనము చేయింతును. నీవు యీ తారకమహామంత్ర ములు చక్కగాకొన్ని కోట్లుపగలురాత్రులు శంతరేకుండా జరిపింపుము. నీవు సర్వ

శుద్ధ జీవివైనావు. నేను సమయము చూచి మన ప్రభువర్యుని నీ యాశ్రమునకు గొనివచ్చి దర్శన మిప్పింతును. ఆ తరువాతనే నీ భార్య కోరిక తీర్పనవాడవై యుంపెను. నీ యాశ్రమమునకు పిలువ బంపను. పిమ్మట మీరిద్దరు స్వామిసేవలో మునిగి సంతోష తరంగములతో తేలియాడ గలరు.

నీ భార్య వచ్చిన తరువాత "శ్రీరామ చరితమానస" మహా గ్రంథము రచింపుము నారదుడు నీవు రామకథ వ్రాయుదువన్నాడు గదా! నీ వపర వాల్మీకివై పేరుపొందెదవు. భక్తిరసముప్పొంగి పోవునట్లు విచిత్ర కల్పనతో నీ మాతృభాషలో వాల్మీకి గ్రంథమాధారముగా కథతో విశేషమగు రీతుల చూపించ గలవు. నా శిష్యుడు ప్రభువరేణ్యుడగు రామ కథారచయితగా పేరొందిన ఎంత సంతోషము. ప్రభువుతో నీ విషయము మనవి చేయుదునని చెప్పియున్న కోట్లు మంత్ర పురశ్చరణతో మంత్రసిద్ధియని యంతవరకు విడువక చేయుమని నిర్దేశించి పల్కెను, తులసీదాసు తన యోగమున కానంద పడసాగెను.

నీకు వీలయిన వేళల యందు నన్ను స్మరింపుము. నీ కనుమానము, భయము లేకుండా వాగ్బలము ప్రసాదించెదను. ఈ మహామంత్రరాజము నిన్ను బ్రహ్మపరానందములలో నుంచునని చెప్పెను. తరువాత శిష్యుని వెన్నుదట్టి శిరస్సుపై నభయ హస్తముంచి మారుతి యంతర్ధాన మయ్యెను.

## తులసీదాసునకు శ్రీరామ దర్శనము

గురువుగారు చెప్పినట్లు తారక మంత్ర మహోరాత్రములు జపము చేయుసాగిన తులసీదాసు క్రమముగా యోగనిష్ఠలో నుండసాగెను. అందు మహాతేజమును దర్శించుచు పరమానందముగా కాలము జరుపుకొను చుండెను. తన పక్షకాల్ల గంగాస్నానము, యోగనిష్ఠ, బ్రహ్మతేజో దర్శనము యిందులోనే దినములు సూర్యోదయ మాదిగా శుభప్రదములుగా గడప సాగెను. తన గురు వక్యాని యానతి ననుసరించి జపము కోట్లాదిగా చేయుచుండెను. అతడు చేయుచున్న జపమునకు గురువుగారు చెప్పిన పరిమితి సమీపించిన కొలది నుత్సాహము, తేజము గల్గి ప్రకాశించుచుండెను. తన శిష్యుడు యింత వాడగుచున్నా

డు. పరమానందముతో హనుమంత స్వామి పరోక్షముగా తిలకించుచుండెను. అతడు నియమిత సంఖ్యలో జపము పూర్తిచేయుట గమనించి ప్రభుని దర్శనము చేయించ నిశ్చయించుకొని తులసీదాసు ముందు నిలబడెను.

అతడు జపనిష్ఠబూని యోగిగా నుండి యెవరిని చూడని స్థితిగల్గుట కానందమంది యొక్కసారి శిరముపై తన చేతి నుంచి తాకెను. అంతవరకు యోగధ్యానంలో జపము గావించుచున్న శిష్యమూర్తికి శరీర విషయము తెలిసి కన్నుదెరచి చూచెను. ఎదుట ధగధగాయమానముగా వెల్గుతు చిరునవ్వులు చిమ్ము ముఖంతో రామనామ గానం గావించు కంఠధ్వనిలో నిలువెత్తు శరీర ధారియగు గురుని నిజరూపము గన్పించెను. వెంటనే లేచి నిలబడి గురుని పాదాలకు సాష్టాంగపడెను, తన శిష్యునియందు పరిమితానురాగంతో సంతోషించి యిట్లనెను.

తులసీ! నిన్ను, నీ భార్యను యిద్దరనొక చోటునకు చేర్చెదను. ఆమెకూడ మహానిష్ఠతో జీవితము సాగించుచున్నది. ఇప్పుడు నీ జపపర్యవసాన ఫలితము పొందగలవు. నీ భార్య కోరినట్లు ప్రభుని దర్శనానంతరమామెను కలుసుకొని యిద్దరు సుఖముగా యోగ జీవితము గడుపుడు. రేపే ప్రభువును ప్రార్థించి గొనివచ్చి చూపింతు ననెను. దానికాతడానందపడి "గురువర్యా! నీవు తలచిన సాధ్యముకాని పనిమేమున్నది. నూరు యోజనములున్న సముద్రం దాటి శత్రువులకు ప్రవేశింప శక్యంగాని లంకలో సీతాదేవిని చూచి శుభ వృత్తాంతం సముద్రము మరలదాటి రాముని కందించిన మేటివి. మమ్ముల కలుపుటన్న నీకెంత? నీ దయయే నాకు కావలసిన" దన్నాడు. గొప్ప హృదయముగల తన శిష్యునిదలంచి వానరస్వామి మురిసి పోవుచుండెను రేపు ప్రభువునకేమి చేయుదువో. మా తల్లి సీతా సమేతముగా నీకు దర్శనం కాగలదని చెప్పి వెళ్ళిపోయెను. శ్రీరామచంద్రమూర్తి సన్నిధికి మారుతిపోయి తన శిష్యునకు తల్లి సీతాదేవితో దర్శనమిమ్మని కోరెను. అదివిని రామచంద్ర ప్రభువంగీకరించెను. తులసీదాసు రామచంద్రస్వామి దర్శనభాగ్యం కల్గుచున్నదని తను యత్నములో నుండెను.

చుట్టుప్రక్కల ఫలవృక్షముల వద్దకుపోయి. యాగమగ్గిన పండ్లు తెచ్చి ప్రోగుపెట్టెను. తన ప్రదేశమంతయు గంగాజలముతో పరిశుభ్రముగా శుద్ధిచేయ జల్లెను. పూవుల మాలలు తోరణములు గట్టెను. పూవులు తెచ్చి పరచుటకు యత్నం గావించెను. సుగంధ పుష్పములు, తులసిదళములు, బిల్వదళములు జాగ్రత్తపరచెను. ఇంతకన్న మెక్కువ యేమున్నది? చదరముగల నొక దుంగను తూర్పు ముఖముగా నుంచెను. దంపతుల నర్పించుటకు సర్వసిద్ధంగా తులసీదా సుండెను. ఆ రాత్రియంతయు స్వామి ధోరణియే! కోడికూత వేళకు లేచి గంగానదీ స్నానం గావించి నిష్ఠబూని తారక జపము చేయుచు శుభతోరణాలం కృతంగా పర్ణశాలను గావించెను,

వారుండు చోటగల చదరపు దుంగమ మీద దుర్భాసనమువైచి పూవులు, దళములు చల్లియుంచెను. తన గురువుదేవునకొక చోటు నిర్ణయించి యుంచెను. దానిమీద కూడ దళములు, పూవులుపరచి యుంచినాడు. తరువాత వారి రాకకై యెదురు చూడసాగెను. ఇంతలో పర్ణశాలలో తీక్షణములేని యొక వెలుగు తళుక్కున మెరసెను. దానిని చూచి తులసి యదురుపడెను.

ఇంతలో తులసీదాసు యెదుట సీతారాములు, హనుమంతుడు నిలబడిరి. ఆ మహాభక్తుడు వారిని చూచి పాదాభివందనములు చేసి తాను పరచిన పూవులు గల స్థానములో నిలబడి యుండిరి. వారి పాదములు గంగాజలముతో ప్రక్షాళనం గావించి యాపాదజలం తన శిరస్సున ధరించెను. రామచంద్ర స్వామిని సీతా సమేతుని చూచి పాదములు పట్టి విడువకుండెను. శ్రీరాముడు తులసీదాసునకు నభయహస్తమిచ్చి వీపు తట్టెను. అతనికి లోపల నుండి రామహస్తం తగులుటతో గొప్ప వాగ్బలం వచ్చినది. శ్రీరామ ప్రభునిట్లు స్తోత్రము గావించెను సీతారామచంద్రా! ఎన్నెన్ని జన్మల పుణ్యఫలమో నేటికి స్వరూపమంది నీదర్శన భాగ్యం కల్గజేసినది మహా ప్రభూ! నిన్ను యెవరు దర్శింపగలరు. నా గురుదేవుని దయతప్ప మరొకటి కాదు. నీవు పంచభూతములతో నిండిన యీ లోకముల కావల నిలబడి నీ తేజముచే సమస్తం చూచుచున్నావు.

నీవు లేనిచోటు లేదు. నిన్ను మించిన దేవుడు లేదు. నిన్నాశ్రయించిన వాడే ఘనుడు. నీ దయగల్గిన జీవి యిహపరములం దానందముగా

మంతగలడు. నేను రక్తమాంస పూరిత దేహధారినగు మానవుడ. నిన్నెవడెరుగును. నీ దయ గల్గిన కొంచెము తెలిసి వచ్చి నిన్ను దర్శింపగలను. ఇతరులు సంసారములో మునిగి దారి తెలియక భార్యా పుత్రాదులు స్థిరమను కొని జీవిత కాలం వ్యర్థం చేసికొని శరీరములు విడుతురు. మరల కర్మ ఫలముచే యేవో నీచ జన్మలెత్తుచు ఖండించక్రమువలె తిరుగుచు తుది మొదలు లేనట్లు జనన మరణములను ప్రవాహంలో బడిపోవుదురు. నా పుణ్యముకొలది యీ మార్గం తప్పించి యీ త్రోవలో నిలబెట్టినావు నిన్ను నా గురుమూర్తి దయతో దర్శించితిని. నా కోరిక తీరిన దన్నాడు.

రామచంద్రమూర్తి సీతా సమేతుడయి యుండి యున్నాడు కోటిమంది కొకడు నన్ను గుర్తించును, అటువంటి వాడవు నీవు నీకు శాశ్వత ముక్తి గల్పించెదను. అంతవరకు నీ భార్యను పిలిపించి నీతో నుంచుకొనుము. మీరిద్దరు నన్ను యీ శరీరములు వదలిన తరువాత చేరగలరు. నా దివ్య చరిత్రను నీ శక్తికొలది రచింపుము. నీకు శాశ్వత కీర్తి లభించును నా భక్తుడగు.

## తులసీదాసు దంపతులు - రామచరిత మానస

ఈ హనుమంతుని సాయం నీకెల్లప్పు డుండగలదని దీవించి శ్రీరామ ప్రభుడు హనుమత్సీతా సమేతముగా మాయమయ్యెను. తులసీదాసు తన జన్మకు సాఫల్యం గలిగించిన యిల్లాలి మాట తలపునకు వచ్చినది. నన్ను యెంత చక్కని దారిలో పెట్టినది. అది భార్యకాదు నాకు ముక్తి ప్రదాయిని. మహాలక్ష్మి ఆనాటి సంఘటన లేకున్న నే నెట్లుండెడివాడనో, ఏ వ్యవసాయమో, వేద సంబంధ జీవనమోనడుపుచు సంసారంలో బడి దారి తెన్నులు లేకుండా బ్రతుకవలసి వచ్చును. ఇదేమి చిత్రము? భార్య ప్రోద్బలమా? గంగాతీరమున నివాసమా? రామనామ జపమా? బ్రహ్మ రాక్షసు దర్శనమా? నారద మునీంద్ర సందర్శనమా? పరమానంద యోగ దాయకమా? ఆ మహానుభావుని మంత్రోపదేశమునకు కోరుగా?ఇవి యన్నియు మానవునకు కలగవలసినవేనా? ఇది యొక పవిత్ర విచిత్ర సంబంధ యోగము.

ఆయన నన్ను మంత్రోపదేశము చేయక మెలి త్రిప్పినట్లు మార్చినాడా? తారకమంత్ర మాయన యుపదేశింపలేడా? నాకు మహాముఖావుని శిష్యరికం శ్రీరామ ప్రభు దర్శన మగునని త్రికాలవేది నారద మునీంద్రుడెరిగియే యింత చేసినాడు. రామాయణ కాలక్షేప ప్రదేశమా? గంగాతీరమా? బ్రాహ్మణ గృహమా? అంత పవిత్రయున్న గురుదేవుని గుర్తులన్నియు చెప్పి పంపినాడు జరుగదగిన దానిని నిర్ణయించినాడు నాకు నా గురుదేవుని ప్రచ్ఛన్న రూపుని వివరించి చూపి నాడు. ఎవరికి లొంగని నా గురుదేవు నన్ను హుంకరించి, యదలించి, బెదరించి, పరీక్షించి తనకు శిష్యునిగా నంగీకరించినాడు.

తన ప్రేమ యంతయు చూసి స్వయముగా వచ్చి తారక మహామంత్ర ముపదేశించినాడు. నా కోరికను మన్నించి శ్రీరామచంద్రుని మంత్రాధిష్ఠాన దేవ తను స్వయముగా మంత్రసిద్ధియైన వెంటనే దర్శన మిప్పించి నా భార్య వాంఛి తము తీర్చినాడు. ఆహా! నా జన్మకాల మహిమగాని యొండు కాదనుకొనెను.

మహా తీవ్ర ప్రతిజ్ఞ నా చేత చేయించి తాను తీవ్రతరమగు దీక్షలో నుండి యింతకాలం రామనామం జపించుచు నిలచిన యిల్లాలిని వెంటనే చూచె దను. ఆమెకు శుభవార్త చెవిలో వేయుదును. మే మిద్దరం యీ పవిత్ర ప్రదే శంలో యోగమార్గం నవలంబించి శ్రీరామసేవ చేసికొందము. నిజముగా భార్య కాదు బ్రహ్మజ్ఞాన బోధి నీ దివ్యశక్తి. నే నా శక్తి బలంతో గదా శ్రీరామప్రభు దర్శనం గావించినది. అందుచే నేను నా భార్యా రూపమున నున్న మంగళదేవ తను దర్శింతునని బయలుదేరెను. అతడు తన భార్యయున్న యత్తవారి గ్రామం ప్రవేశించెను.

తులసీదాసును చిరకాలం క్రితం యెప్పుడో చూచినారు. ఇప్పుడు గడ్డము, యోగ వేషముతో నున్న వాతనిని చూచి యెవరో సాధువు భిక్షాటనం నకై వచ్చువాడనుకొన్నారు. తిన్నగా నత్తవారింటికి పోయినాడు. సాధువు లోనికి ప్రవేశించుచున్నాడని తిరగబడి చూచుచున్నారు.

అతడు ముందుగదిలో శ్రీరామసేవ చేయుచు యోగినీ రూపములో నున్న యిల్లాలిని కనిపెట్టి గుమ్మము ముందు కూర్చుండెను. ఆమె తన పూజా

ర్లాంతరము తలయెత్తి చూచెను. తన భర్తకున్న వుట్టుమచ్చ కంఠము మీద దానిని చూచి సంతోషముతో లేచి నిలబడి నమస్కరించినది. అతడామె చేతులు పట్టుకొని "నీవు పెట్టు నమస్కారమున కర్హుడనుగాను. నీవే నా యధిష్ఠాన దేవతవు. ఇంత భీషణమగు వ్రతముతో నుండిన నీ హృదయశక్తికి నేను చేతులు జోడించెదను. నీ చలువ వలన శ్రీరామచంద్ర దేవుని దర్శనం గావించితిని. నన్ను నీవానాడు శాసించిన ప్రకారం శ్రీరామప్రభు దర్శనం పొందినాను.

ఆ సంతోషములో నిన్ను చూచి నా వెంటబెట్టుకొని నా యాశ్రమములో నుంచుకొని దివ్య దీక్షతో మనమిద్దరము రామసేవ చేయుచు జీవయాత్ర సాగించ దలచినాను. నాతోదరమ్మా. నీ కోర్కె తీరినది. నా కోరిక తీర్చుము నా చరిత్రము చాలా చిత్రంగా మంచబట్టది. నాకు శ్రీరామ దర్శనం కాకుండా నిన్నుచూడ రాలేదనెను."

అది విని యా యమ్మ పరమానంద మందినది. తనలో నిట్లు భావించినది, ఇప్పుడుగదా మా దాంపత్యంలోని నిర్మల సుఖం, నా భర్త మహా యోగమునంది దేవతల కందరాని శ్రీనివాసుని దర్శించిన పుణ్యాత్ముడుగా మారుట ఆశ్చర్యం కాదా? సామాన్య మానవుడు యోగనిష్ఠ ప్రభు దర్శన యోగం యెట్లు జరిగినది. ఇది నమ్మదగిన విషయమా? కాదా? వేనన్నాను గాని యది జరుగునా? ఏమో నాశాశ్చర్యంగా నున్నది. నాపతి యబద్ధ మాడడు. ఇంత నిత్యానంద మూర్తిగా నుండడు. ఎట్లు జరిగినదో విని యానందించెదను యని నాలోచించి యిట్లనెను. మీకు శ్రీరామప్రభు దర్శనం జరిగిన విధానం నేను వినదగునా? వారేమి శలవిచ్చినారు? నాకు ముచ్చటగా, హృదయ మానందమందునట్లు వివరింపుడని సాదరంగా బల్కెను. దానికి తులసీదాసు మొగమున గొప్ప సంతోష కాంతులు వెలిగ జిమ్మ నిట్లనెను.

నీ కోరిక ననుసరించి నేను గంగాతీరం జేరి యొక యాత్రికుల్లు విన్నది కట్టుకొని యందే యుండి గంగానది స్నానం రామనామ జపము

చేయుచు కొంతకాలం జరిపితిని. చాలకాలం జరుగగా నొకనాడా యాయాశ్రమ ప్రాంతమందున్న రావిచెట్టునుండి యొక వికృతాకారముగల జీవి వచ్చి నమస్కరించి యిట్లనెను. మహాత్మా! నీ జప తీర్థముతో నా దోషం పోయినది. తాపము తగ్గినది. నేను కొంతసేపటికి దివ్య విమానములో యీ శరీరం విడచి దివ్య రూపంతో పోదును. నీ జపమునకు గురూపదేశ మంత్రం తారకము గావలయును నారద మునీంద్రుడు రేపు వచ్చును. నీవాశ్రయింపుమని ప్రోత్సహించి వెడలి పోయెను. నేనా నారదమునీంద్రు నాశ్రయించి మంత్రోపదేశం చేయుమని ప్రార్థించితిని.

ఆయన నన్ను చూచి నీకు తగిన గురుని చూపెదను. ఒక ముసలి బ్రాహ్మణుడు రామాయణ శ్రోత యీ దారిని పోవును. పట్టుకొని యాశ్రయించి యెంత మొరాయించిన వదలకుము. తారక మంత్రముపదేశించునని చెప్పి నారద ముని వెళ్ళిపోయినాడు. ఆయన మాట ప్రకారం మా వృద్ధ బ్రాహ్మణుని విడువ పట్టుకొంటిని...దయతో తారక మంత్రముపదేశించెను.

ఆయన ఎవరనుకొన్నావు నూరు యోజనం సముద్రందాటి సీతా దేవిని దర్శించి లంకాదహనం గావించి శ్రీరామునకు సీతా చూడామణి నందించిన వాయుమహాదేవుని పుత్రుడు. నా గురుదేవుడాంజనేయ స్వామిగా వెరుగుమన్నాడు. అమె గ్రుడ్లు తెల్లబెట్టినది. ఎంతపని జరిగినది? ఆహా! నా భర్త దేవ తాకోటి కంధరాని మహా వేల్పులను దర్శించుటా? తారకమంత్ర ముపదేశమందుటా? యెంత మహాఫలమనుకొని హద్దులులేని సంతోషంతో నుండి యిది యిట్లయిన శ్రీరామచంద్ర స్వామిదర్శన మెట్లబ్బినదని యడిగినది. నాకు మంత్రోపదేశం చేసిన తరువాత నాకు యీ మంత్రాధిష్ఠాన దేవత రామ ప్రభుని దర్శనం చేయించుము. ఇది నా భార్య శాసనమన్నాను. దానికి నా గురుదేవుడానందించి "యీ నాకియుపదేశించిన తారక మంత్రం యిన్ని కోట్లు జపింపుము. మంత్ర సిద్ధి యైనవెంటనే నా ప్రభుని నీయందనురాగం సీతాసమేతంగా గొనివచ్చి దర్శన మిప్పించెద"నని వెళ్ళిపోయెను.

నేను దీక్షతో పగలు రాత్రులు విడువకుండా యన్నికోట్లు మహామంత్రం యోగనిష్ఠ ద్వారా జపించితిని. నా గురుదేవుడు ముందువచ్చి "నీకు మంత్రసిద్ధి యైనది. రేపు రామచంద్ర స్వామిని సీతా సమేతునిగా గొనివచ్చి చూపించెదనని చెప్పి వెళ్ళిపోయెను. మరునాడు నాపాలివేల్పులు సీతారాములు గురుదేవను నా యాశ్రమమునకు మెఱుపు మెఱసినట్లు తటుక్కు మనెను. వారువచ్చి నా యాశ్రమములో నిల్చి దర్శనమిచ్చి వరదానము చేసెను, నన్ను గొనివచ్చి యీ యాశ్రమములో నుండజేయమన్నాడు. నన్ను రామ కథాగానము గ్రంథరూప ముగా రెండవ వాల్మీకివై రచింపుము. నీకు శాశ్వత లోకవాస మిత్తునని మాయ మయ్యెను.

ఇట్లు తన వృత్తాంతము పూస గుచ్చినట్లు భార్యతో చెప్పి తన వెంట నాశ్రమమునకు రమ్మని చెప్పెను. ఆమె పరమానందముతో యా గాథవిని భర్త పాదములకు నమస్కరించి దీవించమని ప్రార్థించినది. అతడు తన కుడిచేతి నామె శిరమునపెట్టి "శ్రీరామచంద్ర ప్రసాద సిద్ధిరస్తు" యన్నాడు. భార్యాభర్త లిద్దరు గంగాతీరమున నున్న యాశ్రమమునకు ప్రయాణమైరి. ఈ విషయం గ్రామంలో ప్రాకినది. వారి పుణ్యమునకు మెచ్చుకున్నారు. వారివెంట కొంత మంది విరాగులు బయలుదేరినారు. తాము కూడ తరించ నెంచినారు. వారందరా శ్రమమును పెద్దదిగా చేసి యెండలు వానలు మీద పడకుండా చక్కగా తయారు చేసిరి. ఆ యాశ్రమములో నొక పూజా మందిరము. శయన స్థలము, భజనపరు లకు, నుపన్యాసకులకు విశాల మంటపము యివి యన్నియు నందే యేర్పరచిరి. వారు శ్రీరామ పూజాదీక్షలో కొనసాగుచు వానప్రస్థ జీవితము సాగించ సాగిరి. క్రమముగా తులసీదాసు మహిమ కాశీ నగరమంతయు వ్యాపించినది. అప్పటినుండి జనం తండోప తండములుగా రాసాగిరి. శ్రీరామనామ సంకీర్తన ముతో మారుమ్రోగునట్లు సంచరించ సాగిరి.

తులసీదాసునకు గురుదేవుని దర్శన పవిత్ర స్థలమున యా విగ్ర హముంచి మొదట పూజింప తలపు గల్గెను. వెంటనే శ్రీరామ భక్తాగ్రేసరు డగు వాయునందనుని విగ్రహముంచి యర్పించసాగెను. అయన యట్లువిశేష ఖ్యాతి పొందసాగెను. ప్రజలలో మెలకువ వచ్చినది. ఇది యిట్లు సాగుచుండగా

సరస్వతీ ప్రవాహం లభించినది. ఇదివరలో నారద మునీంద్రుడు, గురుదేవుడు శ్రీరామ ప్రభువు ముగ్గురు దీవించి యనుగ్రహించి వరమిచ్చిన కవితా ప్రవాహము వెలికి రాసాగెను. అక్కడనుండి శ్రీరామ రామాయణం తన భక్తికి తగిన పోకడలతో వ్రాయుటకు ప్రారంభించెను. విద్యార్థులు, భక్తులు, విద్వాంసులు తులసీదాసు వ్రాయుచున్న రామకథా ఘట్టములు వినసాగిరి.

ప్రతిదినము రచించిన భాగములు పురాణముగా గానం చేయుటతో విద్యార్థులాయన కవితా ప్రవాహం మానస సరోవరం వలె రామచరిత్ర ద్వారా వెలికి వచ్చుచున్న దనుకొనసాగిరి. దానితో మహా భక్తుడు తులసీదాసు "శ్రీరామ చరిత మానస" యని తన గ్రంథమునకు నామకరణం గావించెను.

## తులసీదాస్ - గురుభక్తి

గోస్వామి తులసీదాసు మహా మహుడుగా భక్తిపరుడుగా జన్మం తరించినట్లు జీవయాత్ర నడుపుటకు మూల కారణం తన గురుదేవుడగు శ్రీ ఆంజనేయస్వామి గదా! తన గురుభక్తి ప్రకటించుటకు నిత్య సంకీర్తనం గావించుటకు భక్తి ప్రధానంగా సర్వదోషములు హరించునదియు, భూత ప్రేత పిశాచాదుల బాధలు పోవుటకు శ్రీరామచంద్ర కటాక్షమందుటకు సర్వలాభములు సర్వ కార్య జయం సంపాదించుటకు మహా మంత్ర యుక్తమగు నలుబది గీతములు (ఛందో బద్ధమగునవి) 'హనుమాన్ చాలీసా' యను నామము నుంచి రచించెను. నాటినుండి నేటివరకు సమస్త ప్రజానీకం దానిని ప్రతి దినము గాని పర్వములందు గాని, బాధలలో నున్నప్పుడు గాని, కార్యభంగాదులు కలయునప్పుడుగాని భక్తితో హనుమంతు నారాధించుచు పారాయణము చేయుచుందురు. అట్లు చేసినవారలు తమ తమ కార్యసిద్ధు లందురు.

తన గురుదేవుని ప్రభావముతో గత మహాగ్రంథము "శ్రీరామ చరిత మానస" యను నామకరణముచేసి రచించినాడు. గురుదేవుడనుగ్రహించి యుపదేశము గావించిన తారక మంత్ర ప్రభావముతో తన జన్మ తరించినది. నన్నుయింత వానిగా చేసిన గురుదేవుని విగ్రహము యిప్పటికి కాశీక్షేత్రమున కనతి దూరంలో నుంచజేసి జీవితాంతం మర్చించుచుండువాడు. ఇప్పటికి కాశీక్షేత్ర

దర్శనం గావించువారు తులసీదాసు విషయము తెలిసినవారు తులసీదాసుకు దర్శన మిచ్చిన మహా బలశాలి యని దర్శింపక మానరు తులసీదాసు గురుపరేణ్యుని దర్శనం పాప హరము.

పెక్కుమంది దర్శించి పూజించి తమ భక్తి ప్రపత్తులు చూపించెదరు. అట్టి మహా గ్రంథకర్త తన గురుదేవుని స్తోత్రము గావించిన విధానమందరు చదువుచు భక్తితో తన్మయు లగుచుందురు. కార్యసిద్ధికి నలుబది దినములు దినమునకు నలుబది పార్లు పఠించుదురు.

## గురు గుణ స్తవము

రామ పూజారి। పర వుపకారి
మహావీర। బజరంగబలీ।
సద్ధర్మచారి। సద్బ్రహ్మచారీ
జ్ఞాన గుణసాగర। రూపవు ఆగర్త।
శంకర సువన। సంకట మోచన।
కేసరీ నందన। కలిమల భంజన।
రాఘవదూతా। జయ హనుమంత।
అంజని నందన। అసురని కందన।
మంగళమూరితి। మారుతి నందన
జయ రణధీరా। జయరణరోర
జయ బలభీమా। జయ బలరామా॥

భావము: ఓ గురుదేవా। అంజనేయస్వామి। నీవు రామపూజా కార్యములో నిరంతరము నిల్చిన ఘనుడవు. పరోపకారము నీ సొమ్ము. నిన్నాశ్రయించిన వారు మహా లాభమునందు నట్లు చేయు స్వభావముదారవు మహా వీరుడవు. రంగమందు మహాబలమును ప్రదర్శించు శూరుడవు. ధర్మమును తప్పకుండా నడచుచు మహా విద్యలు వేదశాస్త్రములు సంపాదించిన వాడవు. బ్రహ్మమునాశ్రయించుటకు మనస్సును నిల్పి దీక్షలో పర బ్రహ్మమును దర్శించుచుండు చిరంజీవివి. జ్ఞానముపొందిన వాడవై సద్గుణముల జలమునకు సముద్రము స్థానమైన వాడవు. జాగ్రత్తతో నున్న రూపము వాడవు.

శివ ప్రదమగువాడా! సమస్త దుఃఖములు నశింపుచేయువాడా. కేసరి కుమారా! విఘ్న స్మరించ గా కలిదోషములు హరించువాడా! నామదూతా! గురు దేవా! హనుమంతకా! నీకు జయము! అంజనీపుత్రా! రాక్షస సంహారా! యుద్ధరంగ ములో చలించని ధైర్యముగల స్వామీ! యుద్ధము నందు గొప్ప నాదము చేయు వాడా! శత్రుభంకరుడా! భీమ బలము గల వాడా! రామ బలమందిన దేవా! జయము. జయము

# శ్రీ తులసీదాసకృత హనుమాన్మహిమాను వర్ణనము

మంజు మంగళ మోదమయ
మూరితి! మారుతి! పూత!
సకలసిద్ధికర కమలతల!
సుమిదిత రఘువర దూత!

భావము : గురుస్వామీ! నీవు మృదువుగా నుండు మంగళ స్వరూపు డవు! సంతోషము మయమగు నాత్మతో నిండిన వాడవు. అట్టి దివ్య మూర్తివి కదా! మారుతీ! పవిత్ర చరిత్రగల ధీరా! నీ చేతిలో సకలసిద్ధులు గల్గియున్న సర్వలోక మూర్తివి. వినయ వివేకములు గల్గి రఘువంశ స్వామికి నిత్యము దూత కృత్యము నడుపువాడవు. నమస్కారము.

ధీర వీర రఘువీర ప్రియ
తిమిరి సమీరకుమార్!
అగమ సుగమ సబకాబుకరు
కరతల సిద్ధివిచార్!

భావము: మహాధీరుడు ప్రతాపవంతుడు నగు రఘువంశ నాథు నకు ప్రియాతిప్రియమైన వాడవు హే వాయునందనా! చీకట్లను అజ్ఞానము వాయువు విసిరినట్లు దూరముగా తరుమగు శక్తివంతుడవు వేద వేదాంగ ములు సులభముగా నేర్పినవాడవు. సమస్తములు దుర్లభముల్ను నున్న సమయ

ములో వాటిని సఫలముగా జరిపించు శక్తివంతుడవు కరము నందున్న యునరిక కాయవలె తృప్తిపరచువాడవు.

సుఖమున మంగళమున నగుణ
సరోరుహ భాను ।
కరహుకాజనబ సిద్ధి
అవిహాయే హనుమాన్॥

భావము: సుఖమునకు సంతోషమునకు సంపదలకు కలువలకు చంద్రుని వలెను, కమలములకు సూర్యునివలెనో వికసింపచేయువాడవు నీవు. హృదయములో ప్రవేశించినంత మాత్రముననే సర్వకార్య సిద్ధులు సమకూర్చు మహా మహా! నీకు నమస్కారము.

సకలరాజ శుభ సమపు ఫల
సగుణ సుమంగళజామ ।
కీరితి విజయ విభూతి ఫలి
హియ హనుమానహిం అను॥

భావము :

నా గురుదేవుని మహిమ అనంతములు. ఒక్కసారి మెరుపువలె నా గురు దేవుడు హృదయంలో ప్రవేశించినవారికి సమస్తకార్యములు శుభములు జరుగుటలో సందేహములేదు. సమస్త జనుల కార్యములు ఫలము నొసంగునవియగును. శుభ శకునములు నిత్యము కల్పించును. హనుమంతుని దలచివారికి కీర్తి వృద్ధి యగును. సర్వకార్యములందు జయము గలుగును. ఐశ్వర్యము సమృద్ధిగా వారికి చేరగలదు.

శూర శిరోమణి సాహసమతి
సమీర కుమార్
సురమితసఖ మఖ సంపదా
ముదమంగళావతార్॥

భావము :

నా గురుస్వామి శూరులలో ప్రముఖుడు అనగా అంతటివాడు లేడు. సాహస మాయన సొమ్ము. ఎట్టి సంకట పరిస్థితులనయిన నెదుర్కొని విజయం సాధించగల ధీరవగల మహామనీషి. సమస్త దేవతానక్షత్రములందు నా గురుదేవుని స్మరించువారై యుందురు. మంగళప్రదుడగువాడు, సంపదల నిచ్చువాడు. ఆ యవతారమూర్తిని ధ్యానించినవారికి సమస్త మంగళములు తప్పక సిద్ధించును. ఆయన సంపన్న ప్రదాతయగు నీశ్వర స్వరూపుడుగాని సామాన్యుడు గాడు. అట్టి గురుదేవుని పాదపద్మములనే నాశ్రయించెదను. నా కాశీర్వాదములిచ్చి, యోగ సంపదలు ప్రసాదించి నన్నుద్ధరించగల మహాప్రభుని సేవ జన్మ జన్మలకు నాకు లభించుగాక; నన్ను చేరవలసిన గమ్యస్థానం నా గురుదేవుడు చేర్చుగాక; నా నమస్కారములు.

## శ్రీహనుమాన్ చాలీసా పారాయణ ఫలము

హనుమాన్ చాలీసా పారాయణం వలన వచ్చు ఫలితము పెద్దలు మహనీయులు యిట్లు వివరించినారు, శ్రీమద్రామాయణంలో నారు కాండము లున్నవి. అందులో ముఖ్యము చెప్పదగినది సుందరకాండం. సుందర శబ్దము నకు అందమనియు, వానరుడనియు విచిత్రమగురీతిగా దలంచి వాల్మీకి సుందర కాండం మంత్ర శాస్త్ర యుక్తముగా బీజాక్షరములు కల్పించి కథను వ్రాసినాడు. అందలి కథా విధానమంతయు నీశ్వరాంశ సంభూతుడగు హనుమంతుని ప్రతాప, పరాక్రమములు చాటుచున్నవి. పైటకు మాత్రం హనుమంతుని విషయమైనను సుందరకాండ పారాయణం కొన్ని కొన్ని విధముల విధానములతో చేయువారి కావలు ప్రయోగములు భూత ప్రేత పిశాచ బాధ శత్రు పీడలు, దారిద్ర్య బాధలు తొలగిపోవుట సత్య సమ్మతము.

అనాదినుండి సుందరకాండ పారాయణం నిత్య సంధ్యాది కృత్యముల వలె నిష్కామ్యముగా పెద్దలు చేయుచు నిరామయులై దీర్ఘాయువుతో తేజస్సు గలిగి జీవించుట లోకవిధి, తమ విషయం కఠిన దీక్షతో కార్య సాధనం గావించు కొనుటకు సప్త వర్గ పారాయణ మొక ముఖ్య విషయం అట్టి మహామహిమగల

హనుమత్పరాక్రమ వర్ణనలతో నున్న సుందరకాండ పారాయణం చేసిన ఫలిత ముతో సమానమగు ఫలిత మీయగలది "హనుమాన్ చాలీసా" పఠనం.

ఈ గ్రంథం పఠించువారు బాధలనుండి విముక్తి పొంద దలచువారు వాంఛితములు తీరునట్లు కోరువారు దీనిని రోజునకు 108 పర్యాయములతో నలుబది రోజులు చేసిన దీక్షాపరులకు జరుగని కార్యముండదు. తానున్న తావు వదలకుండా 108 పొర్లు పఠించుట ప్రశస్తము త్రికాలం రోజులలో పఠించిన వారికి యోగక్షేమములు సదా నా గురుదేవుడు చూచి బ్రోచునని తులసీదాను వర్ణించి రచించెను.

## ప్రార్థనా శ్లోకములు

శ్లో॥ మనోజవమ్ మారుత తుల్య వేగమ్
జితేంద్రియమ్ బుద్ధిమతాం వరిష్ఠమ్
వాతాత్మజం వానరయూథముఖ్యమ్
శ్రీరామ దూతమ్ శిరసానమామి॥

శ్లో॥ అంజనేయమతి పాటలాననమ్
కాంచనాద్రి కమనీయ విగ్రహమ్
పారిజాత తరుమూలవాసినమ్
భావయామి పవమాన నందనమ్॥

శ్లో॥ యత్ర యత్ర రఘునాథ కీర్తనమ్
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్
బాష్ప వారి పరిపూర్ణ లోచనమ్
మారుతిమ్ నమత రాక్షసాంతకమ్

శ్లో॥ అతులిత బలధామం
స్వర్ణశైలాభ దేహం
దనుజవన కృశానుం
జ్ఞాని నామగ్రగణ్యమ్

సకలగుణ నిధానం
వానరాణా మధీశమ్
రఘుపతి ప్రియ భక్తమ్
వాతజాతమ్ నమామి॥

శ్లో॥ గోష్పదీకృత వారాశిం
మశకీకృత రాక్షసం
రామాయణ మహామాలా
రత్నం వందే౽ నిలాత్మజం॥

## హనుమాన్ చాలీసా ప్రారంభము

శ్రీ గురుచరణ సరోజరజ
నిజమనముకుర సుధారి౹
వరణౌ రఘువర విమలయశ
జోదాయకు ఫలచారి
బుద్ధిహీనతనుజానికై
సుమిరౌం పవనకుమార్॥
బలబుద్ధివిద్యాదేహుమోహి
హర హుక పేశవికార్॥

భావము:-

నా త్రిలోక పూజ్యుడగు గురుదేవుని పాదపద్మములా శ్రయించి యా మహామహుని పాద సంబంధమగు దుళించే నా మనస్సుయను యుద్ధమును నిర్మలముగా మండునట్లు చేయుటకునై యారణమును పుచ్చుకొని రుద్ధి వాలోని కల్మషమును పోవుటకు నిత్యము ప్రయత్నించెదను, దానితో నా దోషములు నశించిపోవును గదా॥

ఆ పిమ్మట నా జీవితమునకు వలసిన పురుషార్థములు పుట్టినది మొదలు

చివర వరకు పొందదగిన ఫలితములు అనగా ధర్మముతో నడుచుట మనస్సునందు కోరుకొని న్యాయ సమ్మతమగు కోరికలు శేవనెత్తుట వాటిని పొందియందు లాభములనను భవించుట, చివరకు జీవికి వలసిన ముక్తిని పొందుట యివి యన్నియు ప్రబోధించు శ్రీరామచంద్రుని గుణనామ కీర్తనములు వర్ణన చేయదలచితిని.

నాలోని మలినములున్నప్పుడు శ్రీరామప్రభుని దర్శించగలనా? నా మలినములు గురుదేవుని పాదరజముచే పోగొట్టుకొని ధన్యుడనగుదును. స్వచ్ఛమగు కీర్తితో ప్రకాశించునా ప్రభుని దర్శించుటకు ముఖ్యకారకుడగు హనుమంత గురుదేవునాశ్రయించెదను.

నేను గతములో యెన్నెన్నో దోషము లాచరించితినని యాదోషములకు ఫలితముగా ఈ శరీరము ధరించితిని యిప్పుడు తెలిసికొని గురుస్వామి దయ వలన చీకటిపోవగా నన్నది వెలుగుతో బాటను చూచుచున్నాను. అందులకే పవన కుమారుడైన యాంజనేయస్వామిని సదాశరణించి తరించెదను. ఆయనయే నాకు బలము ఆయనయే నాకు బంధువు. ఆయనయే నా కోర్కెలు తీర్చు మహాదాత. నేనాయనను నమ్మి యుంటిని. నా యజ్ఞానము నశింపుచేసి జ్ఞానదీపమును వెల్గించిన కారణమున నాలోని వికార గుణములు సమస్తము నశించినవి. వాటి వలన వచ్చు బాధలు, దుఃఖములు పటాపంచలైనవి. ఆ గురుదేవు నాశ్రయముతో సమస్త దుర్వికారములు నశించిపోవుగాక! యని వర్ణించెను.

## చౌపాయి

(1) జయ హనుమాన!
జ్ఞానగుణసాగర!

జయకపీశ! తిహులోక
ఉజాగర॥

ఆంజనేయస్వామీ! నీకు జయము! జయము-నీవు హనుమంత నామముతో ప్రసిద్ధిపొందిన బలశాలివి. నీవు నీ బాల్యము నందేయనగా జనన కాలమునందే యాకలిగొనినవాడవై యుదయించుచున్న సూర్యుని ఫలముగా భావించి గగనమునకు యెగిరిపోవుచుండగా నడ్డువచ్చిన వాడిని నిర్లక్ష్యముగా గెంటిపోవుచుండ యింద్రుడు వజ్రాయుధముతో దవడమీదకొట్టగా హనువు నొక్కుడు పడగా నాటి నుండి యీ బిరుదుతో హనుమంతుడవైన స్వామీ! నీకు జయము.

నీవు మహాజ్ఞానము గలిగినవాడవు. నీ హృదయములో నిత్య ప్రకాశుడగు శ్రీరామప్రభుని నిల్పుకొన్న గుణమూర్తివి హేదానవ వీరా! ముల్లోకములలోన ప్రకాశవంతమగు కాంతులు నిండి వెల్గుచున్నవి. నీ ప్రభావము శాశ్వతమై శోభించి మమ్ముతరింపజేయుగాక.

(2) రామదూత! అతులిత బలధామా!
అంజనిపుత్ర! పవనసుతనామా॥

భావము :-

హేరామదూతా! గురుదేవా! నీవు రామచంద్రుని సందేశమును తలదాల్చి సంచరించు మహానుభావుడవు. నాడు శ్రీరామచంద్రుడు సీతాన్వేషణము చేయుచు పంపా సరోవర ప్రాంతము నందుండగా నీ సహజకుండలములు గుర్తించిన రామప్రభువునకు సుగ్రీవునితో సఖ్యముగూర్చి దూతకృత్యమును చక్కగా నెరవేర్చినవాడవు ఆ పిమ్మట సీతాదేవిని వెదకు వారలలో ముఖ్యుడవని గ్రహించిగదా నీకు శ్రీరామముద్రికను యీయలేదా? నీవు యెంత కష్టము సహించి మహాసముద్రమును నూరుయోజనముల దూరము యోగ మార్గమున దాటి సీతను దర్శించి లంకా దహనము గావించి మహావేగముతో

తిరిగి సముద్రం దాటి వానర వీరులను కలియుతేదా! వారితో సీతాదేవి చూడామణిని రామునకిచ్చి వారిద్దరకూ దూత కృత్యము నెరవేర్చిన మహా ఘనుడు.

నీ బలమును యెవరు వర్ణించగలరు? నీ బలమును గుర్తించినవారు యింద్రుడు, దిక్పాలురు, శ్రీరామచంద్రుడు, మైనాకుడు, ఛాయాగ్రహము, లంకిణి, రావణ బలగము అక్షయ కుమారుడు, ఇంద్రజిత్తు మొదలగువారలే ఎరుగుదురు. వాయుదేవుని తనయుడవన్న విఖ్యాతి నిలబెట్టినవాడవు. నీ అంజనేయుడవను విఖ్యాతిగన్న పుత్ర పురుషుడవు. నీ తల్లి యంజనాదేవి బ్రహ్మచర్య దీక్షలో నుండగా వాయుదేవుడు శివతేజము వాపి గర్భమున ఫలరూపముగా వందించ జన్మించిన కారణజన్ముడవు. నీవు నిజముగా శివాంశచే పుట్టినవాడవు.

నీవు వాయునందనుడవు. వాయువు నిన్ను నీ తల్లి యంజన గర్భమున నుంచి నిన్ను కుమారునిగా నభిమానించినవాడు నీకు వజ్రాయుధం దెబ్బ తగులగా నిన్ను సమస్త ప్రపంచము దద్దరిల్లు వాయు దిగ్బంధనము చేయడా? కుమారునిపై ననురాగముంచలేదా? యట్టి పవనునకు కుమారుడవు పావనీ! నీకు నమస్కారము.

(3) మహావీర విక్రమబజరంగే
కుమతినివార సంతుతికే సంగే॥

ఓ గురుదేవా! నీవు మహాపరాక్రమ వంతుడవు. నీ పరాక్రమము ఎవరు వర్ణింపజాలరు. నిన్ను బ్రహ్మాదిదేవతలు మతింతురు. సీతాదేవికి విశ్వ రూపము చూపిన బలపరాక్రమములు ప్రకటించి యెట్లున్నావు తల్లీ! నిన్ను యీ సముద్రమును దాటించి నూరు యోజనములు గాదు లక్షయోజనములైనను గొనిపోవగలనని ధైర్యము చూపించిన మహా ప్రతాపమూర్తివి. నీ వీరత్వము

ఎవరు పొగడగలరు? నిన్ను దేవతలు పరీక్షకు పెట్టి సురసను పంపలేదా? ఆమె నోరుతెరిచి నిన్ను మ్రింగబోవగా నామె శరీరమును మించిన శరీరము పెంచగా నామెయు పెంచినది. ఆమెను మించి నీవు పెంచలేదా? చివరకు దేవమాయను యని నమ్మి సూక్ష్మరూపముతో నామె శరీరములో దూరి బైటకు వచ్చిన నీ వీరత్వము యెవరికి గలదు? నీ వీరవిభవము వర్ణింపగల సమర్థులు లేరు.

యుద్ధములో నీ వీరత్వము వర్ణించగలరా? నీవానాడు లక్ష్మణుడు మూర్ఛలో మునిగినప్పుడు విభీషణ, జాంబవంతాదుల ప్రోత్సాహముతో సంజీవి గొనిరా బయలుదేరలేదా? మారీచ కుమారుడు కాలనేమి నిన్ను మోసగించ చూడలేదా? అది యట్లుండ నిన్ను చంపుటకు జలాశయము వద్దకు పంపలేదా? అందున భయంకర రూపములందియున్న మొసళ్ళను మ్రింగనీయకుండా నీ శక్తితో వాటి నీపల బడవేయలేదా? దుర్మార్గులను దండించుటలో జంకు లేకుండా నిల్చినవాడవు. దురాగతులను నివారించు శక్తివంతుడవు.

నిన్నారాధించుచు శ్రీరామ నామము గానము గావించువారలకు వెంట నిలబడి, వెన్నుదట్టి రక్షించు ఫలదాతవు జగదీశుడవు. సమస్త శక్తులు నిన్నాశ్రయించు వారల కొనగు పుణ్యమూర్తివి. పుణ్యాత్ములగు వారివెంట నిలబడి వారు కూడగా శ్రీరామచంద్ర దర్శనము గావించు మహానుభావుడవు.

(4) కంచనవరణవిరాజ సువేశా.
కాననకుండల కుంచితకేశా

భావము :

నీవు జగన్నాథమూర్తిగా నెరుగుదును. నీ శరీరకాంతులు సహస్ర సూర్యులు వెల్గునంత దూరము వ్యాపించు తేజోమయ రూపము వాడవు. అనగా నీవు బ్రహ్మతేజముతో నిండియున్న పూర్ణరూపుడవు. పరబ్రహ్మము నీయందే

యున్నట్లు నీవు హృదయం చీల్చి చూపించిన తేజస్సంపన్నుడవు. నిన్ను సామాన్యులు గారుగదా. విశేష తపోవిభవములతో నున్నవారలు కూడ చూడలేరు. నా పుణ్యముకొలది నిన్నాశ్రయించు బలప్రయోగం నాకు గలిగినది. నీ దివ్య రూప దర్శనం నుపదేశించవలెంచు దయాకిరణం నామీద ప్రసరించిన మహానుభావా! నమస్కారము. నిన్నధ్యాత్మ విదులుగాని దర్శింపజాలరు.

నీవు స్వయంగా ప్రకాశించు మూర్తివి. నానావిధములగు వేషములు ధరించి లోకమందలి భక్తుల నుద్ధరించు మహనీయుడవని యెరిగితిని. నీవు జన్మతో దివ్యకుండలముల ధరించిన ప్రభుడవు. నీ కుండలములు నీ దివ్య రూపం మెవరు చూడగలరు? నాడు సుగ్రీవుడు నిన్ను దూతగా పంపినప్పుడు మారువేషముతో రామలక్ష్మణులను దర్శించలేదా? వారితో రాజనీతి ధర్మసూత్రములను కలిపి వారితో సంతోషించిన నీ పాండిత్యమునకు రామచంద్రస్వామి నిన్ను గ్రహించలేదా ?

నీ ప్రభువునకు సూత్రమే కన్పించిన కుండలములు చూచి యేమన్నాడు శ్రీరాముడు. నీవు మారుతీ వేషముతో నన్ను దేవతామూర్తివిగాని సామాన్య వానరడవుగావు. నీవెవరవని ప్రశ్నించలేదా? నీ మకరకుండలములు యితరుల కగుపించినవా ? దేవదేవుడు నిన్ను గహించి చేబట్టినాడు. విచిత్ర కాంతులు జిమ్ము శ్రేకపాశముగల స్వామిని నీవనెను

(5) హాథవజ్ర అరుధ్వజావిరాజై।
కాంధేమూంజ జనేవూసాజై॥

భావము :

ఓ వానరస్వామి! నీవు బాహ్యమునకు వానరరూపముగాను నున్నావు గాని జీవులలోని చంచల మర్కట స్వభావముల వారిని శిక్షించియో రక్షించియో దగ్గరకు చేర్చగల దయామయుడవు. నీ బాహువులు వజ్రముతో సమానము.

నీ హస్తతాడనం తగిలిన మాత్రమున యెందరు బలవంతులగు రాక్షసవీరులు యుద్ధములో మృతి వెందలేదా? నీ చేతిలో రామధ్వజమున్నది. నీవు రథముగా రామరావణ యుద్ధములో నుండలేవా? నీ చేతిలో రామధ్వజమును రథమున నున్నట్లు ధరించి సంచరించలేవా? నీ చేతిలోని ధ్వజం చూచే శత్రుసైన్యములు వానర వీరుడు హనుమానుడని గ్రహించి ప్రాణములు వదలిపెట్టలేదా? శ్రీరామ ధ్వజం సామాన్యమా?

నీ చేతిలోని ధ్వజం భూమ్యాకాశములునుండి విలబడినదిగదా! ఆ ధ్వజమోంకార నాదం చేయుచు మహా శబ్దమునకు శత్రువులు గుండెలదరిపోవగా మహాశక్తులు పాగిపోవగా శ్రీరామ పరబ్రహ్మ మధ్య సింపచేసిన మహా శక్తి శిఖామణివి. నీవు బ్రహ్మచర్య దీక్ష పూనినవాడవు. పర కాంతలను మాతృ దేవతలగా దలంచి పూజించు బ్రహ్మచారివి. నీ ధరించిన బంగారు జంధెములు యెవరు దర్శింపగలరు? వాటిని దర్శించిన బంధనములు తొలగిపోవా? నీవు కాపాడవా? గాఢమగు బ్రహ్మచర్యమునకు నివాదర్శమూర్తివి జగదీశుని సన్నిధిలో హృదయమర్పించిన ధన్యుడవు.

యజ్ఞోపవీత దీక్షబూని హృదయమగు మహోద్రవరిమును, పరబ్రహ్మమను యగ్నిదేవునియందు హోమము చేయగా దీక్షగ జంధెములు ధరించిన పావనమూర్తివి. నీకు పదే పదే నమస్కారములర్పించెదను రక్షించుము.

(౯) శంకరసువన కేసరి నందన
తేజ ప్రతాప మహాజగవందన॥

భావము :

నీవు శంకరుడవు శం యనగా శుభముగు కల్గజేయు స్వామి. శంకరుడ పందురు. నిన్ను దలచినవారికి సమస్త శుభములు గల్గును. ఏ యశుభములుండవు. నీవు శివస్వరూపుడవటచేతనే యందాదులు నిన్ను జయింపలేక పోయినారు.

చిరంజీవివై యున్నావు. నాడు శంకర తేజమును వాయుదేవుడు పత్రపుటములో నుంచి యంజనాదేవికిచ్చిన కారణమున నీవు శంకరుడవు. అంజనాదేవి వానర ప్రభుడగు కేసరికి పత్నియగుటచే నీవు కేసరీ నందనుడవైనావు. నిన్ను గర్భములో ధరించిన యంజనయున్న పర్వతరాజు నీ స్వరూప భారం మోయలేక క్రిందకు కూలబడలేదా? నేను ఈ భారం మోయలేననలేదా? నీ భారం యెంతో యెవరు గణించగలరు?

నీవు తేజోమూర్తివి నిన్ను కన్నెత్తి ఎవరు చూడగలరు? నీ ప్రేమ యెవరు గ్రహించగలరు? నీ ప్రతాపం యెంత గొప్పది. నాడు సుగంధ పుష్పము లకు నీ తమ్ముడు భీమసేనుడు పోవుచుండగా, ఎంత వింతదీసి నువ్వు నీ తమ్ముని యందెంత ప్రేమ చూపినావు. వృద్ధ వానర భయంకర రూపము దాల్చి దారికడ్డుగా పరుండలేదా? బలగర్వంతో పోవుచున్న నీ తమ్ముని గ్రహించి కదలలేనట్లు పరుండ తప్పుకొమ్మన్నాడు గదా! నీవు యిచ్చిన సమాధానము యెంత గొప్పది. ముసలి వానరుడను నీవు తోకవు తప్పించుకొని పొమ్మనలేదా?

దానితో నాతడుచేతితో నెత్తబోవ తోక క్రింద వేలిని నొక్కిరానీయక పోగా గ్రహించి నిన్ను దేవతామూర్తిగా పొగడినాడు. అప్పుడు నిజరూపముతో తమ్ముని యెదుట నిల్చి దీవించి పంపిన ఘనుడవు. ప్రపంచమునందలి ప్రజలందరి వలన మన్ననలు పొందుచుండు సకలజనులకు పూజనీయమైన మూర్తివి. గురువరా! నాసాష్టాంగ వందనము.

(7) విద్యావానగుణీ అతిచాతుర!
రామకాజకరి వేకోఅతుర!!

భావము :-

నీవు నేర్వని విద్యలేదు. నీ విద్యాభ్యాసము విచిత్రమైనది. సకల వేద శాస్త్రములు బోధించగలిగిన మహా తేజోమూర్తి సూర్యభగవానుడు. ఆయన

నిత్యము సంచారము చేయువాడు. ఉదయ పర్వతమునుండి యస్తగిరి వరకు సంచారముచేయు గురువువద్ద యెట్లు విద్య నేర్చుకొన్నావు స్వామీ! ఉదయగిరి నొకకాలు యస్తగిరి మీద నింకొక కాలు పెట్టి నీ చెవిని గురుదేవుడగు సూర్యుని సమీపమున నుంచి చతుర్వేదములు ఆరుశాస్త్రములు యితర దివ్యకళలు కష్టపడి సంపాదించిన దిట్టవు నీవు వ్యాకరణములు నేర్చిన ఘనుడవు. సద్గుణములన్నియు నీ సొమ్ము నేర్పరి తనము నీ యందే యున్నది. నీకు చతురోపాయములు చేతితో నిమ్మపండు వలెనున్నవి ఎవరు నిన్ను దలచిన వారికి సమస్త విద్యలు చాతుర్యము, సాహసము, ధైర్యము, బలము సమస్త రోగ నివారణము భూత ప్రేతాదుల భయరాహిత్యము గల్గించు శక్తి చింతామణివి.

నీవు శ్రీరామ భక్తాగ్రేసరుడవు. నీ యంతవిశ్వాసము గల స్వామి భక్తి పరుడు జగములందెవరున్నారు. నీ విశ్వాసము, స్వామి భక్తి ప్రభువు నెంతగా నానందపరచినదో నిన్ను కౌగలించుకొని తనలో కలుపుకొన్నాడు. అందుచేతనే ఘురవరదాన బిరుదమందిన ఘనుడు. ఎవరికి బిరుదు వచ్చును. రావణుని కొలువులో నీవు చెప్పిన సందేశ వాక్యములలో నెంత చాతుర్యమున్నదో రసజ్ఞులగు వారికే తెలియగలదు.

అంతటి పరాక్రమశాలినవలీలగా తృణీకరించిన నీ రామభక్తి మహిమ శేషుడుగాని చతుర్ముఖుడుగా వివరించజాలడు. శ్రీరామ నామ సంకీర్తనమే లోకములందు గావించినను నీ చెవినిబడును. నీ వచ్చటనే యుందువని మహాముతులు వశించెదరు.

(8) ప్రభుచరిత్ర సునివేకోరసియా,
రామలఖన సీతామనబసియా.

భావము:-

నాడు నాథు దర్శనమీయబోవు సమయములో నెక్కడున్నావు? కాశీ నగరములో వద్రాహ్మణుని యింట జరుగుచున్న శ్రీరామ చరిత్రము పురాణ

ముగా పొగుచుండగా మునలి బ్రాహ్మణ రూపము ధరించలేదా? విచిత్ర వేషములు లోకములందలి వారు తెరుగకుండా నంచరించు నత్యమూర్తివి. ప్రారంభమునుండి యీశాన్యదిశలో గూర్చుండి పరమానందంతో ప్రభువరుని చరిత్ర మాలకించలేదా? నేత్రంల నుండి కన్నీరు బొటబొట కార్చలేదా? నీ విషయము నేను చూడలేదా? నాకు తెలిసినది. రామకథలోని నంతోషం హృదయోత్సాహం నీకు తెలిసినట్టు యెవరు తెలిసికోగలరు? అందుచేతనే నిన్ను రామ కథామృత రసము నిరంతరం పానం చేయు వాడవని మతింతురు.

నీవు రసం త్రాగిత్రాగి మహానందంతో సగము మూసిన నేత్రంలలో మత్తుగా చిందులు త్రొక్కుదువు. రామకథానందంలోని మాధుర్యము తన్మయత్వ కారణము నీకు పూర్ణం తెలియుట చేతనే నీ వంటి రామ భక్తి పరుడు యెవ్వడూ లేడని ప్రపంచఖ్యాతి నంపాదించుకొన్నావు. నీ హృదయములో సీతారామలక్ష్మణులకు నివానము గల్పించి యుంచుకొన్న స్వామి భక్తపరుడవు. శ్రీరామునితో నంగ్రామము నారదుని మునీ కల్పింప బడినది గదా? ఆ రాజును వదలమన్న వదనలేదా? నా ప్రాణము లిత్తునుగాని వదలనని స్వామితో డీకొన్నవాడవు.

నీకు యెవరు బలమన్న రాముడన్నావు నేనేకదా నీ బలమైన నన్ను తిరస్కరించెదవా? నీ మాట పొగదనగా రామా! నా హృదయములో సీతారామ లక్ష్మణులున్నారని హృదయం చీల్చి చూపిన ఘనుడవు రామదాస స్వామివి. నీకనేక వందనములు.

(9) సూక్ష్మరూపధం సియహిం దిఖావా
వికటరూప ధరిలంకజరావా॥

భావము :—

శ్రీరామచంద్రుడు వనవానము చేయుచుండ రావణుడు సీత నపహరించగా సుగ్రీవునితో నఖ్యము చేయించిన ఘనుడవు. సీతను వెదకుటకు నలుదిశలు పంపిన వానరవీరులలో నీవు ప్రముఖుడవు కదా? దక్షిణదిశలో రావణుని

నివాసమని నిన్ను విశ్వసించి కార్యసాధనము గావించువారిలో ఘనుడవని రామ ప్రభుడనుకొనిగదా! నీ కంగుళీయక మిచ్చినారు. నీవు సామాన్యుడవా? యనేక రూపములు దాల్చగలవు. అనేక శక్తులు ప్రదర్శించగలవు. అనేక గమనములుగా నడువగలవు. నీవు ధరించిన యన్ని రూపములలో సూక్ష్మరూప మెంత గొప్పది. లంకానగరము ప్రవేశించినప్పుడు యే రూపముతో నున్నావు? లంకిణీ మహా శక్తివంతురాలు గాన నిన్ను కనిపెట్టినది. వెంటనే యా సూక్ష్మ రూపము వదలి భీమరూపము ధరించి దానిని యుంచలేదా?

అక్కడ నుండి సీతను వెదకుచు దోమవంటి సూక్ష్మరూపమున గదా! లంకలో సీతను వెదుకనారంభించితివి. అట్టి అశు మధ్యను సీతాదేవియున్న యశోక వృక్షమున నుండి పరులకు గనబడకుండా మనలేదా? సీతాదేవి నిన్నను మానించుననని సూక్ష్మరూపముతో గదరామకథాగానమారంభించినావు. ఆ సూక్ష్మ రూపముతోనే సీతామాతృ దర్శనము గావించుకొన్న ఘనుడవు. నీవు బహురూపములు ధరించగలవన్న దానికి నిదర్శనము వినుడు రాక్షసులు చుట్టుముట్టినారు,

నీవాలమునకు నిప్పంటించినారు. నీవప్పుడే రూపముతో నున్నావు? వికటరూపము ధరించలేదా? నీ భయంకర రూపమునకు లంకానగరమంతయు గడ గడలాడలేదా? గురుదేవా! నీ మహిమ లెవరెరుగుదురు? లంకాదహన కార్యమెవరు చేయగలరు? నీవద్భుత పరాక్రమమూర్తివి! ప్రభో! నీకు నమస్కారము.

[10] భీమరూపధరి అసుర సంహారే!
రామచంద్రకే కాజ సంవారె!

భావము :—

నీవు భయంకర రూపము ధరించగల సామర్థ్య మున్నవాడవని నీ చరిత్రయే చెప్పును. కాలనేమి యా నాడు నిన్ను మోసగించి మాయాముని వేషముతో నాశ్రమము కల్పించినాడు గదా! వానిని నమ్మి నీవు ముందు వానికి పాదాక్రాంతుడైనావు. నిన్ను సంహరించి రామకార్యము భగ్నము గావించ

రావణుడు పన్నిన పన్నాగముగాన యందు చిక్కుపడితివి. దాహమనగా నీకు యీ పెద్ద మొసళ్ళున్న చెరువులో నీరు త్రాగమని పంపించలేదా? నిన్ను మొసలి రూపముతోనున్న యప్సరస పట్టుకొన చేతితో పట్టు విడిపించుకొని బయటకు పడవేయ నిజరూపమందినది గదా! తన చెలికత్తెలకుగూడ శాపం విడిపించి నీకు కాలనేమి వృత్తాంతము చెప్పినది గదా! అప్పుడు నీ చాతుర్యము గమనించ దగినది.

వాలి వద్దకుపోయి "గురువర్యా! దాహము తీరినది. మీ ఋణము తీర్చుకొలేను, బహుమతిని గ్రహింపుడని యెంత గ్రుద్దు గ్రుద్దినావు. వాని మాయావేషముల కాటుగట్టించినావు. వికృతరూపుని కాలనేమని భీమ రూపముతో సంహరించలేదా? ఎంతమంది రాక్షసవరులను భయంకర రూపంతో సంహరించి నావు. నీవు నా పుణ్యముకొలది దురుదేవుడవైనావు నీ మహాశక్తులు, నీ యోగ బలము, బ్రహ్మచర్య వ్రతము నెవరు బూనగలరు? వాటి నెవరు నిగ్రహించ గలరు? స్వామి! నీవు రామచంద్ర ప్రభునకు రథముగా మున్నవాడవు.

అనగా నీ శరీర రథములో మహావీరాగ్రణి ధనుర్ధారియగుట, రామ ప్రభుని ధరించి స్థానముంచి, నిరంతర మారాధించు పరమోత్తమ పుణ్య మూర్తివి. నిన్ను స్మరించిన యేయశుభములు రావు. నీ యందను నన్ను నిల్పు కొన్న దయామయమూర్తివగు నీకు వేనవేలు నమస్కారములు.

(11) లాయనజీవన లఖనజియాయే।
శ్రీరఘువరహరాషి ఉరలాయే॥

భావము :—

ఓ అంజనేయ ప్రభూ! నీవు లక్ష్మణు జీవనము యిచ్చిన నెరదాతవు. నీవంటి స్వామిభక్తి వరుడున్నాడా? ఇంద్రజిత్తు ఘోరమగు బాణము ప్రయోగించి లక్ష్మణుని మూర్ఛ గావించినాడు గద! రాముడు తన తమ్మునికి వచ్చిన కష్టము నకు మహా విచారముతో నున్నాడు. తన తమ్మునికి బ్రతికించుట కుపాయము తెలియక బాధపడుచున్నాడు. ఆ సమయములో బలవంతుడు వృద్ధుడగు జాంబ

వంతుడు రాముని చూచి. ద్రోణగిరిమీద సంజీవి తెచ్చిన బ్రతుకునన్నాడు, ఆ మాటలు విని తెల్లవారులోపున ద్రోణగిరిమీద సంజీవితెచ్చు సమర్థుడెవరని వారిలోవారు తర్కించుచుండిరి. రామ వా॥ ధురంధరుడు సేహనుమంతుడు దానికి సమర్థుడన్నాడు గదా వానిని పంపమన్నాడు. రామాజ్ఞతో పరుగుమీద బయలు దేరినాడు,

దారిలో యెన్నో చిక్కులు దాటి ద్రోణగిరి చేరినావు గదా నీ సాహసము వర్ణింపకరమా॥ అందులో సంజీవి యేదియో తెలియక వెంటనే ద్రోణపర్వతమునే చేతిలో పెట్టుకొని బయలుదేరి వచ్చిన మహావీరుడవు గురుదేవా॥ మహాప్రకాశతో వెళ్లొందుచున్న పర్వతమునుచూచి సూర్యోదయమైనదని బాణమెక్కు పెట్టబోవగా యది ద్రోణాద్రియనీ చెప్పలోన నీవు వచ్చి ముందు గిరీంద్రము నుంచినావు. సంజీవిని జాంబవంతుడు గ్రహించి లక్ష్మణుని బ్రతికించిన వాడవు. నీవంటివా డున్నాడా॥ శ్రీరామచంద్రమూర్తికి హృదయానందము కల్పించినవాడవు.

నిన్ను చూచి రామప్రభువు "నా సోదరుని బ్రతికించి దుఃఖము పోగొట్టిన నీవు నా సోదరులలో నొకడవేను యని తన యనురాగము వెల్లడించు చుండె దహనుమాన్ దేవా॥ నిన్ను నెట్లు పొగడగలను॥ నా హృదయము నీ కర్పించి వినన్న సేవించినవారికి మరణ భయములు లేకుండా సంజీవిగా నుందువని నా నమ్మకము.

(12) రఘుపతికి కీన్హీబహుత బడాయీ॥
కహా భరత సమతుమ ప్రియ భాయీ॥

భావము :—

నీవు రామచంద్రప్రభుని ప్రశంసలనెట్లు పొందినావో దేవతలుకూడ పొందజాలని విధముగా పొందినావని నేనమచున్నాను. రామచంద్రప్రభుని సేవించుటకు నీకన్నగాని నీ వెనుకగాని యెవరైనా నిలబడినారా॥ నీవు ప్రభుని వలన పొందిన ప్రశంసలు యెన్ని యున్నవో నేను వర్ణించుచున్నాను. మగ్రీ

వునిలో సఖ్యం చూపించినావు. సీతాన్వేషణంలో ముందడుగు వేసి అందగమైంద ద్వివిద జాంబవంతాదులతో దక్షిణపు దిశకు ప్రయాణముగాలేదా? నిన్ను విశ్వాస పాత్రునిగా దలంచి చేతియుంగరం జ్ఞానవాళుగా నీకే యీయలేదా? నీ యంత వారులేరని ప్రశంస పొందలేదా? నూరు యోజనములు సముద్రందాటి సీతా దేవి క్షేమం గుర్తించుటలో ప్రముఖత్వం పొందలేదా? లంకాదహన కార్య మెవరు చేయగలరు? సీతాదేవి చూడామణిని మరల రామున కందీయలేదా?

ఇట్లు సీతారాముల సేవయందే నిమిడియున్న నీ దీక్షను ప్రశంసింపక రాముడుండునా? లోతు గుండెగల రామచంద్రస్వామి యితరుల హృదయం తెరుగునుగాన నిన్నే నియమించి, నీ వలన తన కార్య సాధనం గావించుకొని తృప్తిచెంది నిన్ను ప్రశంసించినాడు. అట్టి జగదీశుని ప్రశంసల నందుట సామాన్యులకు గాదుగదా. దేవ గణమునకు కూడ శరంగాదని చెప్పవచ్చును. నీవు మంగళ దేవతవు. నిన్ను స్మరించినను. ధ్యానించినను శరణువేడినను సమస్త శుభములొసంగు వరదాతవు.

నిన్ను రాముడు పరమనిష్ఠతో సోదర భక్తిని స్వార్థం వదలి ప్రశ ంసించి యున్నాడన్న పోలికతో. భరత సమాన గౌరవం నీకిచ్చియున్నాడు. రాజ్యం వదలి యన్నగారు ధరించిన రీతిగా వస్త్రాదులు ధరించి, అన్నను చూచువరకు నేలపై పరుండి భోగములు వర్జించిన కఠిన దీక్షాశాలితో సమముగా నిన్ను ప్రశంసించినాడు.

(13) సహసవదన తుమ్హరో యశగావై।
అసకహి శ్రీపతి కంఠలగావై॥

భావము:-

ఓ ఆంజనేయస్వామీ! నీవు వేయి ముఖములతో సంస్తుతుల పడసినావు. అనగా శేషుడు వేయి ముఖములవాడు. తన ముఖములతో నిన్ను పొగడుచుం డును. అక్కడకు తృప్తి పొందుటలేదని భావం. నీ మహిమను కోట్లాది దేవ గణములానాడు సూర్యబింబమును కబళించబోయినప్పుడు గ్రహించలేదా?

వజ్రాయుధంతో నిన్ను యింద్రుడు కొట్టగా, నీవు పర్వత పార్శ్వంలోపడి పోవగాని తండ్రి యది చూచి నిన్ను సమీప గుహకడకు గొనిపోయి యందునిల్చి తన చలనం మానియుండలేదా? సమస్త లోకములు వాయువు బంధనంతో గడగడలాడిపోయి బ్రహ్మదేవు నాశ్రయించలేదా? బ్రహ్మ యింద్రాదులను వెంటబెట్టుకొని నీ తండ్రి నిన్ను యొడిలో పెట్టుకొని కూర్చున్న స్థలంనకు వచ్చినారుగదా! వారందరు నీ తండ్రిని స్తవములున గావించినారు. నిన్ను మించి నా కెవరక్కరలేదని వారిని నిర్లక్ష్యం చేసినాడు.

వారందరు నీ తండ్రిని బ్రతిమాలి నీ తండ్రితో నిట్లన్నారు. నీవు యింతమందికి ప్రాణాధార మవ్వగదా! నీవు లేకున్న సృష్టిసాగదు. నడువదని యనగా మీరందరూ నా కుమారునికన్న యెక్కువగాదు. నేను నా చలనం సాగనీయను పొండనగా, వారందరు వాడి వారి యాయుధములతో మరణం లేకుండా వరమీయలేదా? నిన్ను నీ తండ్రి రక్షించినప్పుడు సహస్రవదనములతో స్తవములు గావించినారు.

నీవు శ్రీరామచంద్రుని యాలింగన భాగ్యపొందిన మహానుభావుడవు. నీ కన్నధన్యుడులేడు. నిన్ను నేను సదా స ధ్యానించి తరించెదను. పరమున నీవు శ్రీరామప్రభు మందిరమునకు చేర్చగల నా యధిదేవతవు.

**(14) సనక సనాదిక బ్రహ్మాదిమునీశా!**
**నారద శారద సహిత అహీశా!**

**భావము:-**

మహానుభావా! కపీంద్రా! జగదేకవందితనామా! నీవు సనక సనందన సనత్కుమారసనత్సుజాతాదులు మొదలి దివ్యమహద్వారమునకు ప్రవేశం ముందు నీ యనుజ్ఞపొందవలసి నయింత మహానుభావుడవు. బ్రహ్మాది దేవతలు నిన్నుఘనముగా నిరంతరం స్తవములు చేయుచుండుటాశ్చర్యం. నిన్ను నీ నామగానం నారద మునీంద్రుడు వంతకం చేయుచు నేను తరించి నాననియుప్పొంగు చుండునుగదా! వాణీదేవి నీయనంత ప్రతాపమును యెన్ని

గతుల పొగడుచుండునో దేవగణములకే యెరుక ఎవరు పొందలేని రామనామ గానము నిరంతరం భజించు పార్వతీ సంకరులు కూడ నిన్ను పొగడుటయెంత వింత! రామతారక మంత్రమును జపించి యందులో నున్న మహిమ గ్రహించిన వారిలో నాదిదంపతులు పార్వతీ శంకరుల మించినవారు లేరని యందురు. అట్టి వారలు సహితమాంజనేయుని మించిన రామభక్తితరుడు లేరని వేనోళ్ళ చాటు చున్నారు.

శేషుడు సర్పజాతిలో జన్మించినవాడు. వారి ముఖములో విషముండును. కాని శేషుడు తన సహజ విషము నుపసంహరించి మహామతితో శ్రీపతి సేవ యందు బుద్ధి గల్గి వెంటనే వైకుంఠమున్న క్షీరసముద్రములో ప్రవేశించి యా హరికి పాన్పుగా మారిపోయినాడు. అట్టి శేషుని దర్శించుటకు యెట్టివారు వత్తురు.

ఆ మహాను భావుడే తన వేయితలలతో నిన్ను శ్రీరామభక్త శిఖా మణివని నిరతముగాన్ం చేయుట విని బ్రహ్మేంద్రాదులు విడువక నిన్ను పూజిం చుట ధ్యానించుట నీ నామ జపం గానం చేయుటచే సహస్ర విధముల సహస్ర ముఖముల నిన్నభివందిచుచున్నారు గురుదేవా ! సకల దేవపూజ్యుడవగు నీకు నా నమస్కారం.

## (15) యమకుబేర దిగపాలజహాఁతే
## కవికోవిదకహి సకై కహాఁతే॥

**భావము:—**

నిన్ను అష్టదిక్పాలురు పొగనుచుండురు. వారు సామాన్యులా! సమస్త ప్రాణులను తన పాశదండములతో కట్టి గొనిపోయి తన రాజధానిలో నిల్పి విచా రణ చేయువాడు వారివారి కర్మల ననుసరించి శిక్షలు విధించి సంహరించు ధర్మ మూర్తి ఆయన పేరు చెప్పిన లోకములన్నియు భయముచెందుట లేదా? ధర్మ శాస్త్రం ననుసరించి జీవుల కర్మఫలం ప్రకారం దయా దాక్షిణ్యములు

లేకుండా చూచిన నీ చర్యలు గమనించిననాడు తాను నీ తండ్రి కిచ్చిన వరం ప్రకారం మరణమను మాటలేకుండా చిరంజీవిత్వము నిల్పి యున్నాడు. నీవు చిరంజీవివి. ప్రపంచములో ధనవంతులలో నగ్రగణ్యుడు కుబేరుడు. ఉత్తర దిక్కున కధిపతి తనవద్ద నవ నిధులున్న సంపన్నుడు. అన్ని నిధులలో నెన్ని తీసినను తరుగులు లేకుండా యట్లేయున్నవాడు పైన శంకరునకు స్నేహితుడు. అంత బలవంతుడు. ధనవంతుడు. గొప్ప ప్రాపుగలవాడు నిన్ను చూచి నీ నామం దలచి నీ ప్రభుని సేవలో నింతగొప్పవాడు లేడని తన సభలలో ప్రశంసించుచున్నాడు.

అగ్ని హోత్రుడు నీ మహిమ నెరిగినవాడు గద ! ఆ నాడు లంకా నగరములో నీ వాలమంటించి నిన్ను బాధింప దలచిన రాక్షసులకెంతటి భయ సందేహములు పుట్టినవో నీవు యే మాత్రమైనకమలినావా? నిప్పుసెగ తగిలినదా?

అదియంతయునగ్ని దేవుని మహిమయో? నీవు నిరంతరం జపించు తారకమంత్రబలమో? నిన్ను పండితులు, మహాకవులు. విజ్ఞానులు, ముడతెగని భక్తితో నీ నామం స్మరించుదురు. అందరివలన పూజలందు గురుస్వామి! నీకీర్తి శాశ్వతం నీకు నమస్కారము.

(16) తుమ ఉపకార సుగ్రీవహిఁ కీన్హా
రామ మిలాయరాజపద దీన్హా॥

భావము:—

నీవు సుగ్రీవునకు చేసిన యుపకారము నెవరు వర్ణింపగలరు? అనాడు వాలి తన సోదరునితో బయలుదేరి, రాక్షసునితో యుద్ధం చేయుచు గుహలో నుండగ రక్త ప్రవాహములు, రోదనలు విని భయపడి పెద్దబండ నడ్డుపెట్టినాడు. తాను యిక దారిలేక కిష్కింధకురాగా రాజ్యములేని రాజ్యమునకిరాదని పట్టాభిషేకం మంత్రులు గావించినారు. వాలి యుద్ధము చేసి గృహద్వారమునకడ్డముగా రాతిమంచిన తమ్ముని ద్రోహునిగా నిర్ణయించెను. పరుగుమీద వచ్చి

సుగ్రీవుని రాజ్యభ్రష్టుని గావించి వాని భార్యను చెరబట్టి తరిమివేసెను. సుగ్రీవునకు శరణ్యములేదు.

ఆంజనేయస్వామీ! నీవు చేసిన యుపకారములలో ముఖ్యమైనది. మతంగ మహాముని శాపమున వాలి ప్రవేశింపరాని గిరిమీద నీవు సుగ్రీవుని నిల్పలేదా? వానికి మంత్రాంగము నెరపలేదా? అదికాక జటావల్కల ధారులు, ధనస్సులు అమ్ములపొదలు ధరించిన రాజపుత్రులను పంపాతీరమున చూచి సుగ్రీవుడు వాలిచే పంపబడ్డవారనుకొని భయమందలేదా? నీవా భయము పోగొట్టి నేను పోయి విచారించెదనని మారువేషముతో రామలక్ష్మణులను దర్శించి వృత్తాంతము తెలిసికొనలేదా? వారి విషయమెరిగివా వానరరాజు సుగ్రీవునితో స్నేహము గావించిన సీత విషయము తెలియ గలదని చెప్పి వారిద్దరకు గాఢమైత్రికుదిర్చి యుపకారము చేయలేదా? నీవు చేసిన యుపకారమెవరు చేసినారు.

శ్రీరామునితో నేస్తముకుదిర్చి వాలివధను గావింపజేసి రాజ్యము సుగ్రీవున కిప్పించిన మహామంత్రి సత్తముడవు. రాజనీతి నెరిగినవాడవు శ్రీరామ సహాయము సుగ్రీవున కందించి శాశ్వతోపకారము గావించిన గురుదేవా! నమో నమః

(17) తుమ్హరో మంత్రవిభీషమానా
లంకేశ్వరభయే సబజగజానా॥

భావము :—

ఆంజనేయా! నీ మహిమలనంతములు. నీవు గదా విభీషణునకు మానరక్షణము గావించిన ప్రాణమిత్రుడవు. నాడు రావణుడు సీతను గొనువచ్చి లంకలో నిల్పిన సమయములో సీతాన్వేషణకు నీవు బయలుదేరి వెళ్ళినావు. అర్ధరాత్రమున లంకానగరము శోధించు సమయములో లంకాపురిలో రామనామ గానము జరుగు గృహమును గుర్తుగా నీవుంచుకొన్నావు. అందులో రాజగృహముల పంక్తిలో విభీషణ గృహమును యజమాని నామముచూచి ఎంత పొంగి

పోయనో! అది నీవు మరచినావా? ఇవి యంతయు నీ రామభక్తి విశేషముగా నేను తలంచెదను. నాటినుండి విభీషణుని పేరున హృదయములో శిలాఫలకముపై వ్రాసి నంటుచున్నావు. అప్పుడు జరిగిన విషయము యెంతగా విభీషణున కుపయోగించినదో! నేను చెప్పుచున్నాను.

రావణునిపై మీరు వానర వీరులతో మహా సైన్యముతో దండెత్తి సముద్ర మావలిగట్టున విడిసియున్నారు గదా! రావణ సభలో రాముడు వానర బలముతో వచ్చి సముద్ర మావలిగట్టున నున్నవారు, వారిని జయించుపాయము చెప్పుడని రావణుడన్నాడు. అందరు తలకొక రీతిగా చెప్పగా విని విభీషణుడు వారిని వారించి యేమన్నాడు. అన్నా రావణా! రాముడు మానవుడుగాడు, శ్రీహరిగా నెరుగుము, నీవు చేసినపని మంచిది గాదు. సీతను రామున కర్పించి క్షమార్పణ వేడుమన రాజసభలో కాలితో యగౌరవము చేసినాడు.

వెంటనే మంత్రులతో బయలుదేరి రాముని శరణువేడరాగా మిగిలిన వారందరు రావణుని తమ్ముడు శత్రువు, శరణీయరాదన్నారు. అతనిపై వారలుగ వారిని వారించి నాను లంకలో శ్రీరామముతో భక్తుని విభీషణుని చూచినానని శరణమిప్పించిన మహా ఘనుడవు. రావణభయము విభీషణునకు తప్పించిన పుణ్య శాలివి. జయము! జయము!

(18) యుగసహస్రయోజని పరభానూ!
లీల్యోతాహి మధుర ఫలజానూ॥

భావము :—

దేవా! నీవు మహాపరాక్రమవంతుడవు చండభుజ విక్రముడవు. నీజన్మ రహస్యం దేవతలే తెరుగజాలరు. నీవు సాక్షాత్తుశివుడవే. సృష్టి స్థితికారణములు నీ వలనే జరుగుచున్న విలయ కాలములో నీవు విజృంభించి సమస్తము లీనము గావించుకొను బ్రహ్మ స్వరూపుడవు. నీవు జన్మించగా నాకలి భరించలేకపోయి నావు నీ సోదరుడు భీముడే పొటవ వేలంత జఠరాగ్ని గలవాడైనాడు గదా! నీకెంత జఠరదీప్తి యున్నదో! సూర్యుని ఫలముగా భావించి పుట్టుకతోడనే కొన్ని

వేల యోజనముల దూరంలోనున్న సూర్యమండలము మీదకు ఎగిరి భానుని పట్టుకొన బోవలేదా? ఆ పంతచర్యకు దేవలోకములు భీతిల్లిపోవలేదా? నీ మహిమ యెంతటిదో యీ పనిని తలచి యోచించిన తెలియదా?

నీవు మధురఫలముగా భావించలేదా? నీ గమనము చూచి గ్రహమండలములు జ్యోతిర్గణములు గగన చరులగు దేవతాసముదాయములు దద్దరిల్లిపోలేదా? ఎవడు నీకు పోటి. నీవు యంతటి తేజోమూర్తిని రెండు చేతులతో పట్టుకొని మింగబోవుట యెంతటి విచిత్ర విషయము. భానుమండలమును మింగబోవ భావించి బ్రహ్మ నాశ్రయించినాడు గదా! నీ విషయము బ్రహ్మయొకడే గ్రహించినాడు. తొందరపాటున యింద్రుడు వజ్రాయుధము ప్రయోగించినాడు.

నీకు గతా గతములు, త్రికాల విషయములు తేటతెల్లముగా తెలియును. నీ వంటివాడు మరొకడులేడు. నీ బలమంతయు రామతారక మంత్రబలముతో వచ్చినది. నీ జపము లోకముల నుర్రూతలూగించినది. ఇంతవారిగా చేసినది, నీలోని బలము రామమంత్ర బలంగా నెరిగితిని.

(19) ప్రభుముద్రికా మేలిముఖమాహీఁ।
జలధి లంఘిగయే అచరజనాహీఁ॥

భావము :—

హనుమంత గురుస్వామీ! నీవు సముద్రమున నూరు యోజనముల్లు దాటినావన్న యదియంతమున బలము? నీవు ధరించిన శ్రీరామ నామాంకిత ముద్రికా బలముగా నేను చెప్పగలను. నీకు రామనామ మహిమ బాగుగా తెలియునుగాన నేను తగినవాడనని సీతాదేవిని వెదకుటకు బయలుదేరినవాడవు. వానరులతో దక్షిణదిశగా పోవుచు స్వయంప్రభ గుహలో ప్రవేశించి సీతగా నామెను భావించగా తన చరితం విని లంకను జేరుటకు నూరుయోజనముల దూరంబనున్న సముద్రం దాటుట యెట్లని సందియం బయలుదేరలేదా! ప్రతి వానర వీరుడు వారు సముద్రందాటు ప్రయాణం చెప్పగా వినలేదా?

అందరు సముద్రందాటి లంకలో ప్రవేశింప శక్తులుగారని జాంబవంతుడన్న మాటలు యెరుగవా? వానరవరులారా! మీరెందుకు జంకెదుకు. మనలో మహా పరాక్రమశాలి యున్నాడు. అతడు రామకార్యము చక్కబెట్టగలడు. మీరు విచారము వదులుడని నిన్నేమన్నాడు.

ఏమయ్యా! శ్రీరాముడు తన బలమంతయు నీ యందిమిడ్చి రామముద్రిక నెందులకిచ్చినాడు. నీకు శ్రీరామ బలం సంపూర్ణంగా నున్నదని నే నెరుగుదును. నీవు మారుమూల కూర్చుందువా? లెలెమ్ము! యని పొగడగా ఎంతవాడవైనావు. పర్వతములు కదలినవి. వృక్షములు నిన్ను వెంబడించినవి. దేవతలు పూలవాన కురిపించిరి. అంతటి మహామహుడు నిన్ను సంసార సముద్రం దాటింపుము.

(20) దుర్గమకాజ జగతకే ఓతే।
సుగమ అనుగ్రహతుమ్హారే తేతే॥

భావము :—

గురుప్రభో! నీవు దలచిన పర్వములు కదలును, సముద్రం దింకును, భూమి, ఆకాశం కలసిపోవును: నక్షత్రములు, గ్రహములు సమస్తము దొర్లుకొని నేలమీద బడును. నీ బలప్రతాపములు యెవరికి గలవు? మానవులకుగాని దేవతలకుగాని యెవరికి స్వాధీనముగాని దుర్లభకార్యములు నిన్ను దలంచినంతనే నెరవేరగలవు. జగములన్నియు నిన్ను దలిచిన సంతోషంతో నుప్పొంగిపోవును. నిన్ను వ్యతిరేకించినవా రెంతవారైనా నిరుగావలసినదే! భూత ప్రేత పిశాచములన్నియు జై యాంజనేయా!

మహావీర! యని స్మరించిన మాత్రమున పటాపంచలై చెదరిపోవుట తథ్యము. నీవు చేసిన చర్యలు తలచివారు మహామహులగుదురు. నిన్ను స్మరించినవారు యెంతటి వారిగుదురో యెంతటి మహా కార్యములు దిద్దగలవారగుదురో చెప్పజాలను. ఎంతటి దుర్ఘటనలనైన నెదరించి నిలబడగల సాహసము నీ నామమందున్నది.

నీవు నమస్త కార్యములు నీ శక్తుల సంబంధించినవి సమకూర్చు సిద్ధ మూర్తివి. జగత్ప్రతాపమూర్తివని నిన్ను దేవతాగణములు మాటిమాటికి పొగడు చుండుటలేదా॥ నిన్ను గురించి నీ ప్రతాపం సంపూర్ణముగా వర్ణించిన వాల్మీకి యెంత ధన్యుఁడో॥ రామాయణంలోని సుందరకాండమంతయు నీ మహాబల వర్ణనమేగదా॥ దానిని పదేపదే పారాయణం గావించినచో కాని కార్యము లేదు. అటువంటి చరిత్రాత్మకమూర్తివి నిన్ను నేను యీ నలుబది గీతములతో నుతించు చున్నాను.

నేను రచించిన ఈ నలుబది గీతములలో నీమహిమ సుందరకాండ ములో నున్నది నా చాలీసాలో నుంచి వక్కాణించినాను. నీ యనుగ్రహమునకై నేను నిరంతరమాశించుచున్నాను. దానిని నాకు ప్రసాదింపుము.

(21) రాముదుఆరె తుమరఖవారె॥
హోతాన ఆజ్ఞాబినుపైసారే॥

భావము;-

హనుమద్దేవా॥ నీవు శ్రీరామమందిర ద్వారంలో నున్న ద్వారపాలకు డవు. నీ యాజ్ఞలేనిదే శ్రీరామ కటాక్షం పడదు. మున్నుని రామభక్తిని కృష్ణావ తారములో ప్రదర్శించినవాడవు. ఆనాడు ద్వారకములో బలరాముడు శ్రీకృష్ణుని యన్నగారున్నాడు గదా॥ ఆంజనేయుడు శ్రీరాము నెరుగును కాని యీ బలరాము నెరుగడని కృష్ణుడెరుగును. వెంటనే నీవు చేసినపని నే నెరుగనా॥ ద్వారకలో బలరాముడన్న వాడున్నాడట. నా ప్రభువు రాముడుగానుండ నీ బలరాముడెవడు॥ వాని విషయం తేల్చుకొందును. ఎల్లుండి ద్వారకానగరమునకు వచ్చుచున్నానని కబురుచేసినావు గదా॥ ఇది యంతయు నెరిగిన వాసుదేవుడు నీ భక్తికి మెచ్చి యిట్లు నమ ధానం పంపలేదా॥ శ్రీరాముడు సీతానమేతుడై ద్వారకానగరంలో నున్నాడు. నిన్ను రమ్మని యాజ్ఞాపించుట విన్నావు గదా॥ నరే వచ్చెద నన్నావు.

వెంటనే వాసుదేవుడు శ్రీరాముని రూపమంది సిద్ధపడ్డాడు. సత్య

భామను సీతారూపం ధరించమన్నాడు. తాను సౌందర్యవతినని యెన్నోయలం కారములు పట్టుచీరలతో నలంకరించుకొని ముందు నిలబడినది. శ్రీకృష్ణుడు సవ్వుచూ! నీవు సీతవలె గన్పింపకపోయిన హనుమంతుడు మనతోసహితం ద్వారకా నగరమును తన వాలముతోవెత్తి సముద్రంలో ముంచును జాగ్రత్త యన్నాడు. ప్రాణభయమంది సత్యభామ నాకు యేదివద్దని తప్పుకొన్నది.

మహా వేగముతో వచ్చు నీ రాక గ్రహించి వాసుదేవుడు రుక్మిణీదేవిని సీతగా తయారవమన్నాడు. పైటకొంగు మార్చి పెనిమిటి ప్రక్క సీతగాకూర్చుండ నీవు వచ్చి సీతారాముల కభివాదం చేయలేదా? నీలోని రామభక్తికి జగములు కంపించిపోయినవి. నీయాజ్ఞ శిరస్సున ధరించి సమస్తము నిలబడునని గ్రహించి తిని దేవా! దీవింపుము.

(22) సబసుఖలహై తుమ్హారీ శరనా!
తుమరక్షక కాహూకోడరనా॥

భావము :-

నాకు సర్వసుఖములు కావలయునన్న నీ చరణములే శరణమని నమ్మెదను. నీ చరణములు నమ్మినవారు సంసారబాధలందుదురు. నీవు సర్వభక్త రక్షకుడవు. ఆనాడు సముద్రంలో నీ తండ్రి సాయంతో రెక్కలు తెగకుండా మైనాకుడు దాగియున్నాడు గదా! నీ తండ్రి సాయంతో తన ప్రాణమాన రక్షణ జరిగినదన్న విశ్వాసముంచుకుని నిన్ను గౌరవించదలచి నీ ఎదుటకు వచ్చి నిల బడినాడు గదా! నీవు వానిని రాక్షసునిగా దలచి మోపేతిపోతు పొడువగా నీకు వృత్తాంతమంతయు చెప్పినాడు. ఆ మాటలకు నీ కెంత పొంగిపోతివో నిన్ను శర ణము వేడుచున్నాను. నీవు రామభక్తి శిఖామణివన్నాడు గదా! నిన్ను శరణమన గానే నీ హృదయమెంత పొంగిపోయినదో, అతనికి సుఖమునియ నెంతగా వాలో చించితివో! ఆ వేగముతో లంకను ప్రవేశించి సీతను వెదకి నిన్ను బంధించిన వారిని సంహరించి ప్రతాపము చూపలేదా?

లంకాదహనముగావించి తోక చల్లార్చుకొని యిదివరలో వభయదానం చేసిన ప్రకారం నీ యెదుట నిలబడి శరణయన్న మైనాకు డొసగిన సత్కారములు గ్రహించివాని ననుగ్రహించలేదా? నీవు వరదానం చేయు సమర్థుడవు. నిన్నారాధించువారు యెంతటి ఘనులో నీ దయయే దానిని నిరూపించును. అభయదానం చేయుటలో నీ యంతటివాడున్నాడా? అనాడు శ్రీరాముని సహితమెదిరించలేదా? నిన్ను శరణు వేడిన రాజు రామునకు శత్రువైనను వదలినావా?

రామునితో సహితం యుద్ధమునకు సిద్ధపడి ప్రాణములు వదల వలసిన వదలుదునుగాని నన్నాశ్రయము వేడిన ప్రాణిని వదలనని భీకరముగా నిలబడిన ప్రతాపమూర్తివి. నేను నిన్నాశ్రయ దానమడుగుచున్నాను. నీ చరణములే శరణము ఇవే నా జోహారులు.

(23) ఆపన తేజ సమ్హారో ఆపై।
తీనోఁలో కహాకతేఁకంపై॥

భావము:—

నీవు స్వయముగా ప్రకాశించు తేజం గలవాడవు. అగ్ని దేవుడు జ్వాలలను తనలో నిమిడ్చుకొని వాయువు తగిలిన తరువాత మంట లెగ ప్రాకించునట్లు సమయం గుర్తించి నీవు విశ్వరూపము బ్రహ్మతేజో రూపం, పూని సంచరించగలవు. నీ వద్ధయోగ శక్తులన్నియు గలవు. అణువును మించి చిన్నగా మంచగలవు. మహా స్వరూపముతో సంచరించగలవు. తెలికగా శరీరమును మలచగలవు మహామహిమలు నీవు చూపించగలవు. ఇతరుల కదృశ్యముగా తిరుగగలవు. నీ చిత్తం వచ్చిన రూపములు ధరించి నడుపగలవు, మూడులోకములందు కామరూపివై తిరుగాడ గలవు. నీవు యీ రకములగు రూపములగు ధరించకున్న పంపాతీరమున రామునే రూపంతో చూచితివి

వారందరి సంగతి యట్లుంచి నాకు నారద మహామునీంద్రుడు దయతో నిన్ను గుర్తించు మార్గం చెప్పుటచే నిన్ను చూడగల్గినాను. నీవు మనలి

బ్రాహ్మణ రూపముతో రామాయణం వినలేదా? నేను వెంటబడ నన్ను కసరి నా కంటబడకుండా చరించలేదా? నీ దయ నా మీద పడినది గాన నన్ననుగ్రహించితివి ముల్లోకములలో సంచరించు సమస్త జీవ స్వరూపా! వాయునందనా! నీవు హుంకరించితివా పదునాల్గు భువనములు దద్దరిల్లిపోవు? నీ పేరు విన్నా, నీ రూపం స్మరించినా శత్రువుల గుండెలదరిపోయి ప్రాణవాయువులు లేచిపోవుననుటలో సందేహము లేదు.

పవనానందనా! ఆంజనేయస్వామీ! శక్తరక్షకంకణధారీ! ఇవే నా నమోవాకములు, నా ప్రణామములు. గురుదేవా! నీవు మహా గర్జా నాదమువదలి భక్తులకు శ్రవణ సుఖంగా మంచి చెడ్డలు విచారించి చెప్పుము. నిన్ను వదిలినవాడవివేకుడు మూఢుడు జయీభవ! గురుమూర్తి నమోనమః

### (24) భూతపిశాచనికటనహిఁ ఆవై!
### మహావీరజబనామ సునావై!

భావము:—

నీవున్నచోట భూత ప్రేత పిశాచములుండ నేరవు. నీ పేరు చెప్పినచో గడగడలాడిపోవును, అవి యన్నియు యెందులకు? నీవుసూక్ష్మరూపముతో సంచరించబోయిన సమయంలో లంకిణి యెట్లు గ్రహించినది? బ్రహ్మదేవుడు లంకిణిని సృజించినప్పుడు యది బ్రహ్మనుచూచి నన్ను యెందులకు సృజించితివని ప్రశ్నించెను. నా వంశీయుడు రావణుని పట్టణం లంకా నగరమునకు కోటకావలివైయుండుము. నిన్ను యెవరుజయించలేరు. దేవతలుగాని యక్షరాములుగాని భూతాదులుగాని నిన్ను జయించజాలవు. నీకు యెవ్వరడ్డు చెప్పజాలరు. మహా భూతమువై యందుండమనెను. ఆమెవిని నా కడ్డుచెప్పువారులేరా? యటువంటి బలము నా కిచ్చినావా నేనెంతకాలం ఈ బలంతో నుందును? ఎవరివలన నేనుజయింపబడుదును చెప్పుమనలేదా? అదివిని యాతడు వినుము నిన్ను జయించు వాడెవడు చెప్పదనని యిట్లనెను.

శ్రీరామకార్యార్థము మహా వీరుడగు వానరమూర్తి నిన్ను చూపకుండా

లంకానగర ప్రాకారం దాటుచుండ నీవడ్డువడెదవు. అతడు నీ బలమును పట్టించుకొనడు. నిన్ను మించిన బలవంతుడు. నీ వాతని చేతిలో పరాభవమందెదవు. నాటినుండి లంకానగరమునకు విచ్ఛిత్తి వచ్చునని చెప్పి పంపెను. ఆమెయట్లు కోటకావలి శక్తియై యెంతో కాలముండగా సీతా విషయమున నీవు సూక్ష్మరూపంతో ప్రాకారం దాటుచుండ నిన్నెదిరించిన లంకిణి మహాశక్తిని ప్రహరించి యోడించినావు.

అంతటి మహాశక్తి నెదిరించి జయించిన వీరమూర్తీ! భూత ప్రేతాదులు తొలగుటన్న యచ్చెరువు లేదు. నీ నామమును పరమశుభమై కీర్తిపొందినది. దానిని జపించిన వారు పొందరాని మహా వైభవములు యుత్తమలోకములుండవు. సర్వదుష్టభూత భయంకర మూర్తీ! గురుమూర్తీ! వందనం.

### (25) నా సైరోగహర్తై వబవీర!
### జప్యనిరంతర హనుమతవీరా

భావము:-

నీ నామం గొప్ప రసాయనం. దానిని జపించువారికే రోగములు రానే రావు. ఏ బాధలు చెంతనీయని శక్తి యందున్నది. నీ సర్వరోగహరమగు మహౌషధం. నేను నిరంతరం పానం చేయుచుందును. నాలోని హృదయ తాపములు, రోగములు, మనశ్చాంచల్యం, భూతప్రేతాది బాధలు సర్వ పీడలు సమసిపోగొట్టిన మహానుభావుడవు. నిరంతర జపతపములతో నిండిన మహావీరా! వాయుకుమారా! సమస్త పాపములు విదిల్చుకొన్న పుణ్యమూర్తీ! నీవు నా యిలవేలుపువు. నీ ధ్యాన ముద్ర నెవరు వర్ణింతురు. వృద్ధవానర మూర్తివై యుండు గుహాంతరంలో నిల్చి జపం చేయుచు బ్రహ్మతేజం కోటి సూర్య ప్రకాశమానంగా నింపుచుండు మహా యోగివి. జయ వానర వీరా! దివ్యశరీరా! మంగళాకారా! సర్వాధారా! ప్రకాశసంచారా! యని యనేక విధముల దేవగణములు వినుతించుచుండ నిశ్చల సమాధిలో శ్రీరామ పరబ్రహ్మం దర్శించుచుందువు.

ఓ హనుమద్వీరా! నిన్ను వానర వీరులు సీతాన్వేషణలో కార్యములో సముద్రం దాటుట కశక్తులయి దిగులు పడిన సమయంలో నీవు వారి విషయమే పట్టించుకొనలేదు. వారికి దూరంగా నుండి శ్రీరామ పరబ్రహ్మం ధ్యానించుచు నిలబడిపోలేదా? నీకు లోక వ్యవహారములు యేదియు నంటవు నిర్గుణమూర్తివి. నిత్య సంతోష స్వరూపుడవు. నీ విషయం పొంతంగా నెరిగిన జాంబవంతుడు మాత్రమే నిన్ను ధ్యానంనుండి లేపినాడు. అప్పుడు కన్ను దెరచినావు. హుంకరించినావు. మహా గర్జాకారము గావించినావు!

నాయంత వాడెవడు? యీ సముద్రం గాదు సప్త సముద్రములు దాటుదునని నిన్ను నీ బలమును పొగడగా విజృంభించి బయలుదేరలేదా? అఖండ జపతప నిష్ఠామూర్తివి. జగద్బంధువుడవు లోక ప్రాణమూర్తివి. నిత్య మంగళ మూర్తి! నన్ను చేపట్టుము.

(26) సంకటతే హనుమాన్ఛుడావై!
మనక్రమ వచనధ్యాన జోలావై!

భావము :—

హనుమాన్ దేవా! నీవు సమస్త సంకటములు పోగొట్టగల శక్తివంతుడవు. నీవున్న చోట బాధలుండవు. నిన్ను స్మరించిన మానసిక శాంతి వచ్చును. క్రమంగా మనస్సు సంచరించును. ఇతరములగు నాలోచనములు పుట్టనీయవు. జగమునకు ముఖ్యప్రాణమగు నిన్ను స్మరించెదను. క్రమంగా జపం ధ్యానం సర్వం నీవలన గల్గి జీవులు తరింతురు. నీవు రామప్రభు సేవాపరుడవు. శ్రీరాముడు సామాన్యుడా! ఆయన రాజవంశం వారికెల్ల కిరీటమువంటి వాడు. ఎందరు రాజవరులు సీతా స్వయంవరమునకు వచ్చినారు? శివుని విల్లు నెవరు కదా గల్గినారు? వారందరు తెల్లమొగ వేసినారుగదా! ఏనుగు గున్నవలె రాజకుమార వేషం ధరించిన నీ రామప్రభువు విశ్వామిత్రుడు సజ్ఞగొని వేచినాడు. ఏనుగు తన తొండంతో చెరకు కర్రనుపట్టి విరచినట్లు యేనుగు

తొంటమువంటి హస్తంను పొంచి యా విల్లందుకొని దానిని ఖండించలేరా? నీ ప్రభువు యానాడే రాజకిరీటంగా నున్నాడు.

నీ రామప్రభువు పాదరజం యెంతటి మహిమగలదియో గదా! గౌతమాశ్రమములో చట్రాయిగా నున్న యహల్యాదేవిని నిజస్వరూపిణిగా చేయలేదా? అరణ్యవాసం చేయబోవు వేళలో గంగను దాటించగుహుడు భక్తితో నేమన్నాడు. రామా? నీ పాదరజములో మాయయున్నది. రాతిని నాతిగా చేయు గారడివాడవు. నీ పాదములు కడుగకుండా నావ నెక్కనీయనన్నాడు. అటువంటి రామునికి దూతవు.

మీరు తలచుకొన్న నమకూరనిది లేదు. మనమ్ము వచనం క్రియ యనగా త్రికరణశుద్ధిగా మమ్ముల నుంగల శక్తివంతుడవు. నీవు సర్వకామములు తీర్చెడి కల్పవృక్షంవంటి వాడవు. నీ ప్రతాపం నేను వేయి విధంల నుతించెదను.

(27) సాజపరరామ తపస్వీరాజా!
తినకే కాజనకలతుమ పౌజా॥

భావము:—

రాము రాజ్యంవంటిది యున్నదా? శ్రీరాముని పట్టాభిషేకంలో నెందరకు యెన్ని బహుమానం లిచ్చినాడు. నీకు యే బహుమతియు నీయలేదు. నీ గుణమాయన యెరుగును. రాజులకెల్ల కిరీటముగా నున్న రామచంద్రుడు నిన్ను యెందులకు వదలినాడు. నీవు విరాగివి నిస్సంగివి. లోక విషయములు పట్టించుకొననివాడవని యెరుగును. ఆయన మునులకు ప్రభువు, వారి హృదయంలలో సదా నివాసం చేయుచుండును. అట్టి రామచంద్రుడు మునీంద్రుల హృదయంల కాహ్లాదం గల్గించు చందునివంటి శీతలమూర్తియై వెల్గొందును. మునీంద్రులన నెవరు? వారు తనవు, ధన, మాన, ప్రాణములు సమస్తం వదలి శరీరంనకు నే భోగములాశించని మనోనిగ్రహంతో యోగముద్రలో మండు

వారుగదా! వారికి శరణ్యము రామప్రభువు. వారి జీవనము రామనామ జపము, వారి మనుగడ శ్రీరామ పాదపద్మముల సన్నిధిలోనని యందరెరుగుదురు.

అట్టి రామ కటాక్షమందినవారి నీ కన్న మిన్నయొకడులేడు. లేదని సమస్త ప్రపంచము మారు మోగుచున్నది. నీ దయలేకున్న శ్రీరాముని దయ రాదని యెరిగి నిన్ను ధ్యానముచేసిన కృపతో స్వామిని దర్శించెదరు. నన్ను నీవట్లుగావించిన ధర్మదాతవు. నీవే నా గురుడవు. నా తల్లివి. తండ్రివి. దాతవు సమస్తము నీవని నమ్మియున్నాను. సమస్త దుఃఖములు బోగొట్టు మహనీయ మంత్రమూర్తివి. వాయునందనా నీవు నా ప్రాణమవు.

నీవు రామజపతపములో మున్గితేలుచుందువు. ప్రభు పరిచర్య నీకు పరమావధి. అందుచేతే నిన్ను రామదాసుడనియు, శ్రీరామదూత వనియు శ్రీరామ కార్యధురుడవనియు, బహువిధములుగా కీర్తింతురు. స్వామీ! నిన్ను పొగడ జాలని నాయశక్తిని తొలగించుము.

[28] సౌర మనోరథజోకోయిలస్తై।
సోయి అమిత జీవన ఫంపావై॥

భావము:—

ఓ కేసరి నందనా! నీవు మనోరథములు తీర్చుటయందు సామర్థ్యము గల వాడవు ఎందరిని యెన్ని విధముల కాపాడినది నీ భక్తులకే తెలియును జీవులందరు వాంఛలతోనుందురు కొందరు రోగవిముక్తి. కొందరు భక్తి. కొందరు ప్రభుత్వము కొందరు విరాగము. కొందరు రామసేవ కొందరు భూతప్రేత పిశాచ బాధా నివారణము మొదలుగా నెన్నియో యెందరో తమ మనోరథములు నీకు వినిపించుచు తీర్పగా వేడు కొందరు. నీవు వారి భక్తి కానందించి వారి మనోరథములు తీర్చు మహానుభావుడవు. నిన్ను మించిన ఫలదాత మరొకరులేరు నీవభయమిచ్చుటలో జంక, శంకలేనట్టి మహాధైర్యశాలివి నిన్ను స్మరించినవారికి బుద్ధి

బలము పెరుగును. మహా మనీనషులగుదురు శరీరముతో రోగములంటకుండా బలం నొనగికాపాడు బలశాలివి. నిన్నారాధించిన వారికి యశస్సు పెరుగును. అనగా జగంలో వారంతటివారు లేరు వారిఎదురాడ రాదని యనిపింతువు.

నీవు నీభక్తులనావేశించి వారిని సర్వశక్తివంతులుగా చేయుదువు నిన్ను పాసించినవారు నిర్భయులై యుందురు వారికి శరీర భయముగాని, యమ భయం గానీ, దరిద్ర భయముగాని యే భయములుదాటికి రానీయవు శరీరరోగములు వాతపిత్తశ్లేష్మాదుల వలన వచ్చినవి. మానసింంగా కామక్రోధాదుల వలన వచ్చి నవి. యనగా పై రోగములు, లోపలి రోగములు సమస్తం నివారించగల దివ్య నామము ధరించిన ప్రభుడవు.

మందబుద్ధిని తగ్గించి చురుకు తనము, పేర్పు, ధర్మంగల వాగ్బల మిచ్చువాడవు నిన్ను పాసించినవాడు యే యక్షర జ్ఞానం లేకున్నను మహా మహులతో సమానంగా విల్వగలవాడగును. నీ చేతిలో ముక్తియున్నది. నీ నామంలో భక్తి వెల్గుచుండును. ఫలదాతా! నీకు మ్రొక్కెదను.

[29] చారో యుగ పరతాపతుమ్హారా।
హైపర సిద్ధజగత ఉజియారా॥

భావము :—

మూడులోకములకు నిత్యం యోగం క్షేమం గల్గించు ఫల వృక్ష మవు. అందరకు సుఖ ఫలములిచ్చు కల్పవృక్షము, చింతామణి, పారిజాతముగా విలసిల్లుచున్నావు. నీ హస్తములలో సిరికాంతవంచును నీ దష్టితో బ్రహ్మ తేజం భక్తులకు గల్గును. నీ శరీరకాంతితో నిర్మలయోగధ్యానం వచ్చును. నీ పాదఘట్టనంతో మాయాకాశయలదరి పోవును నీ విశ్వరూపములో సృష్టి యంతయు నిండియుండును నీ యుదరం బ్రహ్మాండంపక నిలయం. నీవాలా గ్రమున ప్రకృతి నిబడియుండును యుగ యుగములందు నీవు బహురూపం

లతో వర్తించుచు ప్రజలభీష్టము తీర్చెదవు. నాల్గుయుగములందు ధర్మము నాల్గు పాదములతో నడుచుటకు నీవు తోడుపడుచుందువు శ్రీరామచంద్ర ప్రభువు నీ యందు తారకమంత్ర జప ఫలం ద్వారా ప్రవేశించి నిన్నింతవానినిగా చేసి నాడు.

నీ బలమంతయు తారకమంత్ర బలము నీ శరీరమంతయు రోమ రోమ కూపముల ద్వారా ప్రణవనాదముతో తారకం ప్రతిధ్వనించు చుండును నీవు తారకమంత్రనాదంతో శరీరధారివిగాని నిజం పరబ్రహ్మ తేజోమయుడవు లోకములను సన్మార్గములో నడుపుటకు వారికాదర్శ జీవితము గడుపుటకు యీ వేషం ధరించినావు.

నీలో నవసిద్ధులు గలవు నీయంతట నీవు రోమరోమ కూపము నుండి కోటాను కోట్లు వానరవీరులను బయట పెట్టగలవు అవసరసమయములందు సౌమ్య రూపం, భీకరరూపం రెండును చూపగల సమర్థుడవు. నీకు కామచారిత్వం. సర్వలోకసంచార సమర్థత్వం నీ తండ్రి వాయుదేవునకున్నట్లు నీకున్నవి. పర సిద్ధితై నిన్ను జగములర్చించుచుండును.

[80] సాధుసంతకేతుమ్ రఖవాలే।
అసురని కందన రామదులాలే॥

భావము:—

సాధుసమాజమును రక్షించి కంకణం దాల్చిన ధీబలశాలివి. సాధుజనులకు సంజీవి వంటివాడవు. నీ చరిత్ర పఠించినవారలు నీ యద్భుత శక్తుల తరచి చూడగలరు శ్రీరామ భక్తాగ్రేసరుడగు విభీషణుని శరణాగతి గమనించి సాధువులకు నీ స్నేహ సహకారములు తెల్లడికాగలవు వారందరు రావణుని తమ్ముడు రాక్షసుడు మనకు శత్రుడని చెప్పి శ్రీరాముని చేత ధనుస్సు నెక్కిడ జేయగా నీవు

వారించలేదా? విభీషణుని విషయం లంకా నగరంలో నీవు చూచినది విన్నది నిశాసమయంలో మహా శత్రుపట్టణ మధ్యములో ప్రబల రాజ విరోధియగు రామ నామ సంకీర్తన గావించు పుణ్యాత్ముడు విభీషణుడని చాటిచెప్పి వాని కభయ మిప్పించ లేదా?

నీవు సాధువులకు పక్షపాతం చూపింతువు రామభజనానురక్తులకు తోడుగా నుందువు వి భక్తి బంధమును నిరంతరభమావేశించి యుందువు వారి కార్యములు ఫలప్రదములుగా చేయుదువు రామసహాయ నీసానసిద్ధుడవు మారుతీ నీకడ్డు గలదా? జగదేక బంధువము దుడవు దయాశాలివి ధర్మ రక్షకుడు సర్వ బాధా నివారకుడవు నిన్నాశ్రయించిన వారెంతటియల్పులైనను పాపులైనను క్షమింపరాని నేరములు చేసిన వారైనను దయతో బ్రోచెదవు ధర్మమయమూర్తి వానర రూప బ్రహ్మతేజా! జోహారు.

ఇంతటి భక్తుల నెట్లాదరించెదవో దుష్టగుణములు గల వారై, లోక భయంకరులై గర్వంతో తిరుగాడు దుష్టులు రాక్షస గణంను చీల్చి చెండాడు టలో వెనుకాడవు. శ్రీరామపాదాశ్రయము లేని దుర్గుణులను శిక్షించుట నమ వర్తివై నయముడు నీకు సాటిరాడు గురుదేవా నాపుణ్యంచే నిన్నాశ్రయించ గల్గితిని.

(31) అష్టసిద్ధి నౌనిధికేదాతా!
అసవ రదీన జానకీమాతా!

భావము:—

మహా ప్రభూ! గురుదేవోత్తమా! నీవు అష్టసిద్ధులు నను గ్రహించ గల నెఱదాతవు. అనగా నీవు యోగాధిష్ఠానీ దేవత యోగ మనగా నీవు పూర్తిగా నెర్గుదువు. ప్రాణాయామం ముందు గావించుచు నిన్ను స్మరింపవలయును. ఆ వాయువును యిడా పింగళానాడుల ద్వారా

గ్రహించుట విడచుట వాయువును కుంభించుట మొదలగు వాయువుని గ్రహచర్యలతో క్రమంగా మూలాధార చక్రమందు ముందున్న కుండలి నీ శక్తిని లేపవలయును. అనగా యది పాముచుట్టవలె చుట్టుకొని యుండును. వాయువును కుంభించెడి యహ్యానంలోనా నాడికదలును: దాని ముఖం మూలాధార చక్రముపైపున నుండును. అది వాయువు కుంభించగా యోగిమూలముగా సుషుమ్నానాడియను నాళక గుదస్థానం నుండి శిరస్సులోనున్న సహస్రారం వరకు వ్యాపించి యుండును. దానిని కదుపగా నది యా నాళములోనికి పోవుచు వెలుపలికి వచ్చును పొగుచుండును అట్లా నాడియందు యీ కుండలిశక్తి స్థిరముగా పోవలయును.

అది మధ్యనున్న చక్రముల యందాగుచు పోవుట అభ్యాసముతో నలవడును. ఆ విధంగా యోగగమనం తోడపుట్టిన వష్టసిద్ధులు. అనగా అణిమ, గరిమ, లఘిమ, యిటువంటివన్నియు పుట్టగలవు. అట్లు యెనిమిది రకముల సిద్ధులు గల్గుటకు నీ సేవాభాగ్యమే కారణం. నీవు వాటిని భక్తుని కీయగల సమర్థుడవు. నవ నిధులు కుభేరునివద్ద నున్నవి. ఆ నవ నిధులు నీ దయవలన గల్గును.

నీవు దయతలచినచో కుబేరునంతవానినిగా చేయు మహాదాతవు. మహాలక్ష్మి దేవత యగు సీతామృతమను ఫలమును గ్రహించిన శక్తివంతుడవు. నీకు వేనవేల జోహారులు.

(32) రామరసాయ నతుమ్హారేపాసా।
నదారహో రఘుపతి కేదాసా।

భావము :-

ఓ రామదాస మహాశయా! దీనబంధూ! నిన్ను మొదట నే నెరుగను. నే నజ్ఞానముతో మున్న సమయములో నన్నుద్ధరించుటకు నీవు యెటువంటి నన్ని

వేశం గల్పించినావు, అది యంతయు నీ దయ. నా భార్య యేమంత సమర్థురాలు, నాకు రామచంద్ర సేవాఫలం దక్కించుటకు శ్రీరామ దర్శనం చేయకుండా రావలదు. ఈ శరీరం యెప్పుడో యెుకప్పుడు పోవలసినదే; దీనిని గురించి యింత వెఱ్ఱిప్రేమ పెట్టుకొని ప్రాణములకు తెగించి నే నర్ధరాత్రమున పోవ నన్ను యెంతగా మందలించినదో! అనాటి యామె యావేశమంతయు నీవావహించి చేసినదని యీనాటికి గ్రహించినాను. నీవు సర్వవ్యాపకుడవు అందరి హృదయములలో నీవు నిండియున్నావుగాన యింత ప్రభావం నామీద ప్రసరింపజేసినావు. నేనెక్కడ? రామనామ జపమెక్కడ? ఆ జపకీర్ధ మహిమ యెక్కడ? మహాభూతం నన్ను దయదలచి నారదాగమనం చెప్పుటెక్కడ?

ఆ మహానుభావుడు నాకు తారకమంత్రోపదేశం చేయక జగద్గురుడవగు నీ విషయం నాకు సంజగా చెప్పుటెక్కడ? ఎన్ని చిత్రములు! నా జీవితమన్ని విధముల మలచి నీ పాదసేవ చేయగల శక్తిని ప్రసాదించిన దేవతామూర్తివి. నిజముగా నేను యెంత ధన్యుడనో తెలియకుండా యున్నాను. నీవు యెవరని భావించుచున్నానో తెలియునా? అంజనేయస్వామివని గాదు. నీవు శ్రీరామ నామ మధురసం తొణికిసలాడు భాండమవు.

నీవు కదలిన మెదలిన దర్శనమిచ్చిన దయదలచిన రామరసాయనము తెరటములు కొట్టును. నీవు బహుశ్రద్ధ కల్గిన రామసేవాపరుడవు. వర్ణింప నా తరముగాదు. జగదాధారుడవు గురుదేవా! యివే నా నమస్కారములు.

(౩౩) తుమ్హరే భజన రామకోపావై
జన్మజన్మకే దుఃఖబిసరావై

భావము:-

ఓ మారుతీ! మహాశక్తి శిఖామణీ! గుర్తుదేవగామ్మటీ! నా యొక్క వందనములు స్వీక రించుము. నిన్ను ఎవరు భజింతురో వారు రామ ప్రసాదమునకు తగినవారని వేద శాస్త్రములు ఘోషిల్లుచున్నవి. నిన్ను సంకీర్తనముతో భజించువారలే రామకటాక్షం పొందవర్హులగుదురు. రామదర్శనమందిర ద్వారము ప్రవేశించుటకు నీ యనుజ్ఞ తప్ప యింకొక దారియున్నదా? నిన్ను శ్రద్ధాభక్తులతో భజనసేయువారలు మే నుగతులు పొందుదురో, నీవు ఏ విధ జేయుదువో నీకే తెలియును. నేను చెప్పుట కెంతవాడను. జగదభిరాముడైన రాముడు తన్ను భజించమనుట నా భక్తుడైన హనుమంతు నారాధించిన వారు నా లోకమునకు వత్తురు. నా హనుమద్భక్తుడు యింటికి సింహద్వారం వంటి వాడనినాడు. అందుకే సమస్త లోకములు జైవాయు నందనా! జై మారుతీ జై పవనమానభగవంతా! హనుమంతా! యని కీర్తింతురు.

ఆ కీర్తనలో భూలోకమండలి భూతకాలము యెగిరి గంతులు వేయును. ఏ జీవులైనను యనగా యల్ప శరీర ధారులైనను, ఘన శరీరధారులైన చీమ మొదలు పెద్ద పురుషులవరకు నీ నామము స్మరించినను వినినను మోక్షము సిద్ధించును. అనేక జన్మల నుండి చేసిన పాపములీ విధముగ భజనలతో నీ సేవతో నశించును. ఉత్తమ గతి ప్రాప్తించును.

జన్మజన్మలకు దుఃఖమను మాట వినిపించదు, అనగా నీవు, నీ నామము, నీ భక్తి సర్వ రక్షకుల ప్రసాదించి నిత్యానందము గల్పించును. సదా శుభములు పలికించును. ఎన్ని జన్మలకైన నీపాదసేవ నాకు గల్పించి దయతో నీలో చేర్చుకొనుము,

(34) అంతకాల రఘుపతి పురజాయీ!
జహాఁ జన్మ హరి భక్త కహాయీ॥

భావము:—

శ్రీహరిభక్తులు యెందును బాధపడరు. రోగములుండవు. విచారములు దూరములగును. సంసార బంధనములు విడిపోవును. ఎందరెందరో మహాభక్తులు విమానముల మీద శ్రీహరి నివాసము జేరినారని యెన్నో కథలున్నవి. శ్రీరామ ప్రభువునకు ధన, బల, సంపదలాది విషయము పట్టింపునకురావు. వారు పెట్టుని వేదనల విషయము చవిగొనడు. ఒక్క బడుగు అంగ వికలుడు మతి స్థిమితం లేనివాడు. బధిరుడు, గ్రుడ్డి.. కుంటివానను భేదం లెన్నడు జాతిమతములు పాటించడు. ఆయన పాటించునది హృదయం మాత్రమే. అందులోనున్న భక్తి విషయమే. నీవు రామప్రభుని ప్రధానదానుడవు. నీవెఱుగని దానిచే గమనించెదవు. ఈ జన్మమంతయు హరిభక్తితో గడపిన వారుగాని, హరి భక్తుల పరిచర్యలు చేయువారుగాని హరి నామ గానంచు వారుగాని వారెవ్వరైనగాని, యంత్యకాలంలో హరినామము స్మరించుచు శరీరములు వదలిన వారుగాని శ్రీహరి నివాసమునకు నీవు పంపుచుందురు. నీకు సమస్తము తెలియును.

శబరియే జాతిది? ఏ భక్తి ననుసరించినది? ఎట్లు కాలం జరిపినది? మునీంద్రులకు పరిచర్య చేయుచు రామభక్తి సంపాదించుకొనలేదా? వారి పరిచర్యతో భక్తిదీపము వెలిగించుకొనలేదా? మునుల హృదయముల కామె సంతోష కారణముగాలేదా? వారు శరీరములు యోగ మార్గమున వదలి పోవుచుండగను మీతోగాని పొందని ప్రార్థించలేదా? వారు చెప్పిన సమాధానమేమి? శబరీ శ్రీరామునిగా శ్రీహరి యవతారమెత్తెను.

ఆయన నీ వద్దకు వచ్చును. ఆయన కాతిథ్యమిచ్చి పూజించిన తరించు దనియాత్మ చేసెను. రామునకు రుచిగల ఫలములు తాను రుచి చూచి దాచి యుంచి సత్కారము గావించి విందుచేసినది ముక్తి పొందినది శ్రీహరి భక్తులకు వైకుంఠ ప్రవేశము సులభమగును. అది నీ భక్తి మహిమగా నెరిగితిని.

(౧౮) కాలదేవతా చింతన ధరయా!
హనుమత సేవ సర్వ సుఖకరయా॥

మహాప్రభూ! నిన్ను నేను యిట్లు సంతతము గానము చేయుదును. ఎవరు నిన్ను సంస్తవము చేయుదురో వారు నీ దయకు పాత్రులగుదురు. నిన్నెరుగని వారు లేరు శ్రీరామ నిలయములందు ముందు నిన్ను నిలువనియూరు లేరు. నీ నామము తమ సంతానములకు పెట్టి యానంది-చు దంపతులు ధన్యులు పరమశివా! నీ మంగళరూప ధ్యానము, నీ మంగళ నామ గానము. నీ మంగళ బల, పౌరుష కార్యాచరణము తలచి తలచి మురిసి పోవని హృదయము పాషాణ మగుదగును.

(38) జోశతవార పాఠకర్ కోయీ!
చూటహి బంది మహా సుఖహోయీ॥

భావము :—

ఎవరు ఈ "హనుమాన్ చాలీసా" ప్రబంధమును ప్రతి దినము నూరు మారులు పాఠము గావింతురో వారు ప్రతిభావంతు లగుదురు. మాన్యులగుదురు. పూజనీయ స్థానం అందెదరు. ధన బలం, ధాన్య బలం, సంతాన బలం, గృహారామబలం మొదలుగా సమస్తం గల్గి సుఖ సంతోషముపొందగలరు. వారికి బంధ మోచనమగును. అనగా దుఃఖహేతువగు అహంకారములు మమకారములుండ నేరవు. నిగ్రహముగా నుండి నీ దివ్య తేజమును నిత్యము దర్శించుచు శాశ్వతానందము అందగలరు. ఇందులో సంత శక్తి నిన్ను పొగడిన విధానముగా వ్యక్త మగును.

సమస్త దుఃఖహేతువగు సంసారములో నున్నవారుకూడ దాని యందుండు దుఃఖములు పొందక నీ బ్రహ్మతేజమును దర్శించుచు నిర్మల మనస్సులతో నిగ్రహముగా వర్తింపగలరు. ఇంతటి మహిమ చరిత్రమందున్నది. ఇది నమ్మదగినవిషయము. దేవగణములే నిన్ను పూజించి తరించుచుండ మర్త్యలోక వాసులు నీ శక్తివలన వచ్చు సుఖములు పొందుదురనుటలో సందేహము రవంతయు లేదు.

(39) జోయహపడై హనుమాన్ చాలీసా
హోయసిద్ధి సాఖీ గౌరీసా॥

భావము :—

ఏ ఎవరు మహాభక్తితో, విశ్వాసముతో, సంతోష ప్రధానముగా యీ హనుమాన్ చాలీసా పఠించునో, నూరు మార్లు ప్రతిదినము పారాయణ చేయునో, రోజునకు నూరుమార్లు చొప్పున మండలమ్ము రోజులు అనగా నలుబది రోజులు దీక్షగా పఠించి సేవించునో వారివారి భక్తి విధానమ్ముగా బహుముఖములగు ఫలితము లందుదురు.

దీని యందంత మహిమ యున్నదా? యన్న సంశయ మక్కర లేదు. రామనామ మంత్రమును జపించుచు సర్వసిద్ధిదాయకమై, అష్టయిశ్వర్యములు గల్గి భక్తులకిచ్చుచు పార్వతీదేవికి శ్రీరామ తారకమంత్ర మహిమ నిత్యమ్ము వర్ణించుచుండు యా కైలాస నిలయుడు, గౌరి సమేతుడు సమస్త ప్రమథగణ యుతుడగు శంకరుడు సాక్షిగా సిద్ధించును సుమా.

(40) తులసీదాస సదా హరిచేరా।
కీజై నాథ హృదయ మహఁదేరా।

భావము :—

మహా హరిభక్తుడు, సదా రామసేవా ధురంధరుడు వాయు నందనునకు ప్రియ శిష్యుడు, పావని వలన శ్రీరామ దర్శన భాగ్య మందినవాడు సమస్త ముఖములు హనుమంతు గురుదేవుని యందు నిత్యమ్ము చూచువాడు గురుభక్తి పూర్ణుడు నగు యీ తులసీదాను దయామయమ్ముగు హృదయము గల నీ పద భక్తితో రచించినవాడు. నీవు నా భక్తిని గ్రహించి నా హృదయములో నిత్య నివాసము చేయగోరెదను. నా మనవి నాకర్ణించి నన్ను దయదలచి వీడకుండా నా కుత్సాహము కల్పించమని యీ తులసీదాసు ప్రార్థించు చున్నాడు.

జై వీరహనుమాన్ ।

జై। భజరంగబలీ ।

జై। రామప్రతాపతేజా ।

జై। భక్తకల్పభూజా

జయీభవ । దిగ్విజయీభవ ।।

# మంగళహారతి

దోహా :

పవన తనయ సంకటహరన
మంగళ మూరితి రూప్
రామ లఖన సీతా సహిత
హృదయ బసహుసురభూప్॥

భావము :-

పరమ పవిత్రా! వాయునందనా!
సమస్త బాధలు హరించు! మారుతీ!
రామలక్ష్మణ సీతా సమేతా!
హృదయ మందిర సంస్థాపక! ధీరా!
ప్రేమ చూపుమా! వదలకుమా! హనుమా!
మంగళ గొనుమా! ప్రభువా!
దుష్ట సంహారా రామభుహన
కృపతో జూడుము జపము చేయుదును
సంకటహరణ శ్రీరామ శరణా!
హాయి నొసగు మంగళ హారతి గొనుము ॥

